# విశ్వప్రకాశం
## ఆధ్యాత్మికమాసపత్రిక

శ్రీధాతనామ సం. హనుమజ్జయంతి సంచిక
ఏప్రిల్ 1996

సంపుటి : 2 సంచిక : 6 వెల రూ. 5-00

*ముఖ్య సంపాదకులు*
శ్రీపి.వి. మనోహరరావు

*సంపాదకులు*
శ్రీ అక్కిరాజు రమాపతిరావు

*సంపాదక వర్గం*
డా. బిరుదురాజు రామరాజు
డా. పోతుకూచి సాంబశివరావు
డా. దిట్టకవి శ్యామలాదేవి
శ్రీ కనుములూరి వేంకటశివయ్య, I.A.S.
శ్రీ యం. యల్. నరసింహారావు

*ప్రకాశకులు*
సర్వార్థ సంక్షేమ సమితి
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్.

*ఈ సంచికలో.......*

*సంపాదకీయం.........................2*

*మనుషులమంతా కలవాలి మనసులనంతాకలవాలి.......5*

*అనుభవతరంగిణి....................7*

*వాల్మీకి రామాయణంలో తాటక.........15*

*శ్రీరమణాశ్రమ విశేషాలు........21*

*హృదయవిద్య........................22*

*దివ్యయోగి చరితామృతం.............24*

సంపాదకీయం

# హనుమజ్జయంతి

"బుద్ధిర్బలం యశోధైర్యం
నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వంచ
హనూమత్ స్మరణాద్భవేత్"

అని రామాయణ ప్రేమికుల చిరంతన విశ్వాసం. చిరతర భక్తి భావం. ఈ దేశంలో రామాయణం పరమ పవిత్ర గ్రంథం. రాముణ్ణితలుచుకోగానే భారతీయుల హృదయాలు పరమార్ధభావ రస నిర్భరములవుతాయి. సీతమ్మను తలచుకోగానే నయనాలు చెమ్మగిల్లుతాయి. సత్యం - శివం - సుందరం అనే పరమ రమణీయ విశిష్ట ఆదర్శాలకు సీతారాములు ప్రతీకలు. కొండలున్నంతవరకు, నదులు ప్రవహిస్తున్నంతవరకు రామాయణం ఈ లోకంలో తన ప్రభావాన్ని చూపుతూనే ఉంటుందని భారతీయుల గాఢ ప్రత్యయం. పది గుడిసెలున్న చిన్న పల్లెలో కూడా రామాలయం ఉన్నా లేకపోయినా హనుమద్విగ్రహం మాత్రం ఉండి తీరుతుంది. భారతదేశంలోని అనాది జాతులకు కూడా హనుమంతుడు ఇష్టదైవం. రాజకుమారులిద్దరూ రాజ్యాన్ని అందులో పెద్దవాడు ఇల్లాలును పోగొట్టుకోని అరణ్యాలలో తిరుగుతుండగా పంచభూతాలను మించిన ప్రభావం గల మహాబలశాలి ఒకరు వారికి తారసపడి సహాయం చేసి వాళ్ళకు మళ్ళీ రాజ్యాన్నీ, రాణివను సమకూర్చినట్లు కోదులు చెప్పుకుంటారని ``అమృత సంతానం" అనే నవాలలో గోపీనాథ మహంతి అనే గొప్ప ఒరియానవలాకారాడు రాశాడు. హనుమంతుడు చిన్నలకు పెద్దలకు అందరికీ ఆరాధ్యదైవం. `` రాముడు మంచి రాజు, హనుమంతుడు నమ్మినబంటు" అని పెద్ద బాలశిక్షతోనే బోధించేవారు. తెలుగు పిల్లలకు కిందటి తరం వరకూ. ఆంజనేయస్వామి నవవ్యాకరణ పండితుడు. మహాబుద్ధిమంతుడు. మహా విచక్షణపరుడు. గొప్ప దయాశీలి. భక్తాభీష్ట వరప్రదుడు. సంకట నివారకుడు. రావణుడు మొట్టమొదటిసారి ఆంజనేయస్వామిని చూసినప్పుడు సాక్షాత్తు కైలాసం నుంచి నందీశ్వరుడే ఇలా వచ్చాడా ఏమి? అని భయపడి పోయినాడు. సీతమ్మ వారిని అన్వేషించడంలో రాక్షసుల మధ్య ఆయన కనపరచిన బుద్ధి చాతుర్యం, బలపరాక్రమసాహసధీ విభవం అమ్మవారే మెచ్చుకుంది. హనుమను అగ్నిదేవుడు

బాధించకూడదని తపన చెందింది. తనను చూసైనా కాపాడవలసిందని అగ్నిదేవుణ్ణి అర్థించింది. "యద్యస్తి పతి శుశ్రూషా, యద్యస్తి చరితంతపః యది చాస్త్యేక పత్నీత్వం, శీతోభవ హనూమతః" అని ఆ తల్లి ఆరాటపడింది. శ్రీమద్రామాయణానికి మంధరమనే గొప్ప వ్యాఖ్య రచించి ఆంధ్ర వాల్మీకిగా వినుతయశస్కులైన వావిలి కొలను సుబ్బారావు (వాసుదాసు)గారు ఈ సుందరకాండ శ్లోకాన్ని అందంగా ఇట్లా తెనిగించారు. "భర్త శుశ్రూష యొనరించుపడతినేని, తపములను నిష్ఠ సలిపిన తరుణినేని, నే బతివ్రతనగుటయనిక్కమేని, హనుమయెడశైత్యమూను మీయగ్నిదేవ."

రామాయణగాథలు, వాల్మీకి రామాయణానువాదాలు తెలుగులో ఉన్నన్ని ఇతర భారతీయ భాషలలో లేలేమోననిపిస్తుంది. పోతన మహాకవి, భక్తి సంగీత సమ్రాట్టు త్యాగరాజస్వామి, భద్రాచల రామదాసు తెలుగువారికి రాముణ్ణి తమ వాణ్ణి చేశారు. తెలుగు నాట శివాలయంలో కూడా తప్పక ఆంజనేయస్వామి ఉంటాడు. పోతన మహాకవి భాగవతం ఉన్న మళ్ళీ ఏకాదశ ద్వాదశ స్కంథాలను తెలుగు చేసిన ఖమ్మంమెట్టు వాసి హరిభట్టు తన భాగవతాన్ని ఆంజనేయస్వామికే అంకితం చేశాడు. వసు చరిత్రకారుడు భట్టుమూర్తి గొప్ప హనుమద్భక్తుడు కదా!

ఆంజనేయస్వామి గొప్ప పండితుడు. సూర్యుడి నుంచి సకల శాస్త్రాలూ అభ్యసించినవాడు. `అధిగతార్థ శాస్త్ర ఆంజనేయ' అన్నారు వేంకటపార్వతీశ్వర కవులు తమ రామాయణానువాదంలో. `విద్యావానగుణీ అతి చాతుర' అన్నాడు కదా గోస్వామి తులసీదాసు. ఆ మహానుభావుడు రచించినదీ భారతదేశంలో నిత్యస్తోత్ర పరాయణ పారాయణమైనదీ అయిన `హనుమాన్ చాలీసా' తెలియని వారెవరు? పఠించని వారెవరు?

'వినాశేబహవోదేషాన్ జీవన్ భద్రాణి పశ్యతి' అని లోకానికి ప్రబోధించారు ఆంజనేయస్వామి. అంటే ఎన్నికష్టాలు వచ్చినా మానవుడు క్రుంగిపోగూడదు, జీవితాన్ని భద్రంగా కాపాడుకోవాలి, అనే ఆశావాదాన్ని ప్రసాదించాడు పావని. మహాభారతంలో సౌగంధిక పుష్పహరణ ఘట్టంలో ఆంజనేయస్వామి భీముణ్ణి పరీక్షించిన ఘట్టం, అర్జునుడి టెక్కెంపై అధివసిస్తానని పాండవుల పట్ల ఆయన కనపరచిన అనుగ్రహం భారతగాథకు పరమౌజ్జ్వల్యాన్ని ప్రసాదిస్తున్నాయి.

"హనుమానంజనాసూనో వాయు పుత్రో మహాబలీ రామేష్ఠః ఫల్గుణ

సఖః పింగాక్షో అమితవిక్రమః ఉదధి క్రమణ శ్చైవ సీతాశోక వినాశకః" అని ఆంజనేయస్వామివారిని మనసారా ధ్యానిస్తే, హృదయపూర్వకంగా ప్రార్థిస్తే సకలార్థములూ సిద్ధిస్తాయి అని ఆస్తికుల నమ్మకం. రామాయణ మహామంత్రానికి దేవత రామచంద్రుడు. శక్తిసీత. కీలకం హనుమంతుడు అని రామరక్షాస్తోత్రం చెపుతున్నది. 'రామాయణ మహామాలారత్నం వందే అనిలాత్మజం' అని ఆంజనేయస్తుతి.

"ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయ విగ్రహం
పారిజాత తరుమూల వాసినం
భావయామి పవమాననందనం"

చైత్ర పౌర్ణమి హనుమజ్జయంతి "మారుతిం నమత రాక్షసాంతకం"
"శ్రీరామ జయ రామ జయ జయ రామ"

---

"తల్లి కుమారుడికి నిజమైన గురువు
పుత్రస్యసమ్యగనుశాస్త్రీ అనుశాసనకర్త్రీ

*- ఆచార్య శంకర భగవత్పాదులు - బృహదారణ్యక వ్యాఖ్య*

---

"మోక్షస్య కాంక్షా యదివైతవాస్తి
త్యజాతి దూరాద్విషయాన్ విషం యథా
పీయూషవత్తోష దయాక్షమార్జవ
ప్రశాంతి దాంతీన్ భజనిత్యమాదరాత్॥

మోక్ష కాంక్షివైతే విషయాలను విషంలాగా భావిస్తూ దూరంగా ఉండాలి. అంతేకాదు. సంతోషం, దయ, క్షమ, ఆర్జవం (ఋజుత్వం), శాంతి మొదలైన ఉత్తమ గుణాలు అమృతంలాగా భావించి వాటికోసం ప్రయత్నించాలి.

*- వివేక చూడామణి - శ్రీశంకర భగవత్పాదులు*

# మనుషులమంతా కలవాలి మనసులనంతా కలపాలి

*(విశ్వయోగి విశ్వంజీ మహారాజ్ జన్మదినోత్సవ సందేశం)*

మార్చి 5వ తేదిన గుంటూరు విశ్వనగర్‌లో విశ్వమందిర ప్రాంగణ సభా ముఖాన కన్నుల పండువుగా జరిగిన 52వ జన్మదినోత్సవ సందర్భంగా శ్రీవిశ్వయోగి విశ్వంజీ మహారాజ్ సకల మానవాళికి ప్రసాదించిన అనుగ్రహ భాషణం ఈ విధంగా వుంది.

ప్రేమమూర్తులారా- పుట్టగానే ఎవరికీ పేరు ఉండదు. నామరూపాత్మకమైన ప్రపంచంలో ఏదో పేరు పెట్టాలి. పేరు పెడతారు. ఋషి ఋణం తీర్చాలని నాకు కూడా పేరు పెట్టారు. విశ్వం, అబ్బాయి, చంటి, ఏరా, ఒరే, మాస్టారు, విశ్వం మేష్టారూ అని రకరకాలుగా కన్నవాళ్ళూ సన్నిధిలో ఉన్నవాళ్ళూ పిలిచి ఉంటారు. మరి అయితే శరీరం నశించి యోగి పునర్భవం చెందుతాడు. ఆయన జ్ఞానాగ్ని దగ్ధకర్ముడు. తపస్సు చేత యోగికి కొత్తరూపు అవహిల్లుతుంది. మనసుని శరీరం నుంచి ఛేదించుకొని విశ్వమనస్సుతో తాదాత్మ్యం చెందుతాడు యోగి. చరా చర జగత్తుతో తన సంబంధం పెంచుకుంటాడు యోగి.

ప్రేమమూర్తులారా - మీరు భోగాలకై ప్రాకులాడవద్దు. భోగులు కావద్దు. భక్తులుగా జీవించండి. రక్తులు కావద్దు. విశ్వ సమైక్యానికి ఆసక్తులు కండి. ఇక ఈ యోగి జన్మదినం **Universal Integration Day**గా అంటే విశ్వమానవ సమైక్య సంస్థాపనం గుర్తు చేసే రోజుగా ఉత్సవ సంభరితమవుతుంది. మానవమేధ ఈ దిశగా ఉద్యమించాలి. జగత్తు ఉన్నతికి, సుస్థితికి మానవులంతా ఆశించాలి. పాటుపడాలి. విశ్వవ్యాపితం కావాలి ప్రేమ. పరిధులను ఎల్లలను అధిగమించాలి. మనందరం విశ్వపౌరులం కావాలి. కలహాలు కార్పణ్యాలు నాస్తి నాస్తి అని పలకాలి. ఇవాళ అంతా అశాంతి. మనిషి నశిస్తున్నాడు. జీవించటం లేదు. అందరు ఒకటై మనగలగాలి. మానవత్వాన్ని అన్నిటికన్నా మిన్నగా భావించాలి. పొద్దున వచ్చాడు బీర్‌బాబా ఎక్కడ నుంచి? హైదరాబాదు చార్మినార్ ప్రాంతం నుంచి. మనమంతా ఒకటే అని రూపించటానికి. నిరూపించటానికి.

భగవంతునిపై నిజమైన నమ్మకం ఉంటే నిరుత్సాహం, నిస్పృహ ఉండవు. ఉండకూడదు. మనిషి భౌతిక బలం పెంపొందించుకున్నంత మాత్రాన ప్రయోజనం లేదు. ఏమీ వొరగదు. రావణుని ఉదంతం జ్ఞాపకం

చేసుకోండి. రావణుడు ఏమైనాడు. భౌతిక బలాన్ని నమ్ముకుని సర్వనాశనం అయినాడు. దైవశక్తిని పెంపొందించుకోవాలి మానవుడు. దీనికి ఆధ్యాత్మిక అన్వేషణం అవసరం. శక్తిమంతం కావటానికి తపస్సు, ధ్యానం, నిష్ఠ పని చేస్తాయి. దైవికశక్తి సమాజ శ్రేయస్సుకి వినియోగించుకోవాలి. అహంకారం వద్దు. గర్వం కూడదు. నేను మీ అందరి నుంచి కోరేది ప్రేమ. ప్రేమమూర్తులారా - ప్రేమ అన్నిటిని సిద్ధింపచేస్తుంది. ప్రేమను పెంచండి. ప్రేమను ఇవ్వండి. కలతలు వద్దు. ఘర్షణల జోలికి పోవద్దు. మానవుడు చట్టబద్ధంగా మనుగడ సాగించాలి. రాజ్యాంగబద్ధంగా తన దినచర్యను నడుపుకోవాలి. దేశభక్తి అంటే చట్టానికి రాజ్యాంగానికి లా అండ్ ఆర్డర్‌కు వ్యక్తి లోబడి ఉండాలి. శాంతి భద్రతలకు ముప్పు కలిగించకూడదు. క్రమశిక్షణను ఉల్లంఘించకూడదు.

మన ఋషులు, మహానుభావులు భౌతికతను నిర్లక్ష్యం చేయలేదు. సనాతన ధర్మం ధర్మబద్ధమైన మానవుడి సుఖాలను సంతోషాలను నిర్లక్ష్యం చేయలేదు. అయితే ఒక క్రమత, ఒక సమత, ఒక మమత సమాజంలో మనధర్మం అనుశాసించింది.

మీరు ఇతరులను హేళన చేయవద్దు. శాంతిభద్రతలను పరిరక్షించాల్సిన పోలీసులను కించపరచవద్దు. ఎవరినీ తూలనాడవద్దు. అందరి మధ్య అనురాగం పెంచాలి. సంఘాన్ని సంఘటితంగా ఉంచండి. మీరంతా సంఘటితంగా ఉండండి. మీరు చిరునవ్వులు చిందించండి. ఇతరుల చిరునవ్వు వాల్ని కానుకగా పరిగ్రహించండి. Smile - let others smile- ఆనందోబ్రహ్మ. ఆనందంగా ఉండండి. ప్రేమతత్త్వాన్ని ఇంకా ఇంకా పెంచుకొని అందరితో పంచుకొని, దాన్ని పరమాత్మతత్త్వంతో అనుసంధానం చేయండి.

విశ్వప్రణాళిక, విశ్వదృక్పథం ఎవరికీ వ్యతిరేకం కాదు.

మనలోంచి ఇప్పుడు జాతి రత్నాలు కావాలి. మానవాళికి సకల అరిష్టాలు తొలగాలి. ప్రపంచమంతా ప్రశాంతమయం కావాలి.

ఇవే నా దివ్యాశీస్సులు. మీ అందరికీ అందజేస్తున్నాను. అని ఉత్తేజకరంగా, ఉల్లాసకరంగా

*మనుషులమంతా కలవాలి*

*మనసులనంతా కలపాలి*

అని స్వామిజీ మధురంగా పాడారు. అందరిచేత పాడించారు.

(నివేదన: *అక్కిరాజు రమాపతిరావు*)

# అనుభవతరంగిణి

(గత సంచిక తరువాయి)

- శ్రీజి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ

అమ్మగా, పూలమ్మగా, గులాబీ పూలమ్మగా ప్రఖ్యాతి గాంచిన మాతృమూర్తి చుండూరు కామేశ్వరమ్మగారిని గురించి తెలియని సాయిభక్తులు ఆంధ్రదేశంలో ఉండరని చెప్పటంలో అతిశయోక్తి లేదు. ఆమె గుంటూరు జిల్లాలోని పొన్నూరుకు సమీపంలోనున్న నండూరు గ్రామంలో నివసిస్తూ ఉండేది. ఆమె షిర్డీసాయి భక్తురాలు. బాల్యం నుంచి అనన్యమైన భక్తితో సాయినాథుని ఆరాధిస్తూ ఉండేది. సాయినాథుడు ఆమెను అనుగ్రహించి, ప్రసాదించిన దివ్యలీలావిలాసాలకు లెక్కలేదు. అవి చూపరులకు అత్యాశ్చర్యాన్ని గొలుపుతుండేవి. ఆమె పూజలో కూచున్నప్పుడు ఆమె దోసిటిలోకి వివిధ రకాలైన పూలు వస్తూండేవి. చాలాసార్లు గులాబీ పూలు వచ్చేవి. ఆ కాలంలో పుష్పించని పుష్పాలు గూడా గోచరించేవి. ఆ పూలను భక్తులకిచ్చి సాయినాథుని ఆమె పూజింపజేస్తూ ఉండటం చేత అంతా ఆమెను `పూలమ్మ' అని భక్తి గౌరవాలతో పిలిచేవారు. ఆమెకు ఆ పేరే స్థిరపడింది.

ఆమె ప్రదర్శించిన మహిమలకు లెక్కలేదు. షిరిడిసాయి సమాధి మందిరాలంకృతమైన గులాబీ దండలు ఆమె పూజాగృహంలోకి వచ్చి పడుతుండేవి. అక్కడి అగరువత్తుల పరిమళాలు ఇక్కడ వ్యాపిస్తూ ఉండేవి. చేతిలోకి కుంకుమ వచ్చేది. పాలకోవా, పటిక బెల్లం లాంటి వివిధ ప్రసాదాలు వచ్చేవి. ఒకసారి ఆమె `గంగాస్నానం చేసే మహాభాగ్యం నాకు లేకపోయింది గదా! నా ఆర్థికస్థితి బాగుంటే నేనూ అందరిలాగా కాశీ యాత్ర చేసి ఉండేదాన్ని గదా!" అని విచారిస్తూ ఉండగా - ఆమెకు ఎదురుగా ఉన్న సాయినాథుని పటంలో, బాబా పాదాం గుష్ఠము వద్ద చెమ్మగిల్లి ఉండటం చూసి, దాన్ని గుడ్డతో తుడిచి వేద్దామనుకొని తుడిచింది. ఆ చెమ్మ ఆరిపోవడానికి బదులుగా అక్కడి నుంచి బిందువులు బిందువులుగా జలం స్రవించసాగింది. అక్కడ ఒక చెంబు పెట్టింది పూలమ్మ. అది నిండింది. కారుతున్న జలం కాలువైంది. మహాధ్వానం ఉద్భవించింది. ఆ జలాన్ని రెండు బిందెలతో పట్టారు. ఇంకా జలం కాలువ గడుతూనే వుంది. ఆ వార్త ఊరంతా వ్యాపించింది. అంతా వచ్చి ఆ జలాన్ని బిందెలతో పట్టుకొని

తీసుకవెళ్ళారు. తన ప్రార్థన మన్నించి సాయినాథుడు తన పాదాం గుష్ఠము నుండి గంగాజలాన్ని స్ర వింపజేశాడని ఆమె తెలుసుకొని పొంగిపోయింది. ఆమె తన భర్తయైన రామారావుగారితో కలిసి ఆ జలంతో స్నానం చేసింది. ఆ దివ్యలీలను జూచి ఆమె భర్తగారైన రామారావుగారి హృదయం ఆనందంతో పొంగిపోయింది. మహాశుధారతో కవితా శార్దూల మాయన వదన గహ్వారం నుంచి బైటికి దూకింది.

"పాదాంగుష్ఠము నుండి వెల్వడె మహాధ్వానమ్ముతో తీర్థమా
హ్లాదం బావహిలన్ ప్రవాహగతి, నయ్యారే! జనుల్ మూకలై
తాదాత్మ్యంబు వహించి మ్రొక్కులిడ బ్రత్యక్షానుభూతిన్, భవ
త్పాదాబ్జంబులనంటి వేడెద మహాత్మా! సాయిదేవా! ప్రభూ!"

ఇట్లాంటి లీలలెన్నో పూలమ్మ చూపించింది. ఒకసారి ఆమెకు పినతండ్రియైన మిన్నికంటి గురునాథ శర్మగారు (ఆయన మిన్నికంటి వారింటికి దత్తు పోవటం వల్ల ఆయన ఇంటి పేరు మారింది. ఆయన సుప్రసిద్ధకవి. పండితుడు. శతాధిక గ్రంథకర్త. వేదాంత పారీణుడు) పూలమ్మను చూసి "ఒసేకాముడు! నీ సాయి నాకేమి ప్రసాదం ఇవ్వదలిచాడో దాన్ని ఇవ్వవే" అని హాస్యం చేస్తూ ఆమెను పరీక్షించాలని చెయ్యిచాపాడు. చూచే వాళ్ళంతా ఆశ్చర్యపోయేటట్లు ఇంతలావు కలకండ అచ్చు ఆయన చేతిలోకి వచ్చింది. చెయ్యి బరువెక్కింది. ఆయన నిశ్చేష్టుడయ్యాడు. ఇట్లా చెప్పుకొంటూ పోతే ఆమె లీలలు ఒక ఉద్గ్రంథమౌతుంది. ఆమె లీలలన్నింటిని `శ్రీసాయి లీలాతరంగిణి'గా `తన్మయ' గ్రంథస్థం చేసి సాయిభక్తులకు మహోపకారం చేసింది. ఆ గ్రంథాన్ని అమ్మభక్తుడు, మాస్టరుగారికి అత్యంత విధేయుడు ఐన నోరి రాజ గోపాలశాస్త్రి ముద్రింపజేశాడు. పూలమ్మగారిని గురించి విస్తరంగా తెలుసుకోవాలనుకొనేవాళ్ళు ఆ గ్రంథం చూడవచ్చు.

నందూరులో ఆమె షిర్డీ సాయినాథుని మందిరం కట్టించి, ధుని మొదలైనవి ఏర్పాటు చేసింది. అవధూత రంగన్నబాబు, శ్రీలక్ష్మీకాంతయోగి, .శ్రీవేమూరి వెంకటేశ్వర్లు మొదలైన మహోదయులు ఆమెను `సాయిమాత'గా ప్రస్తుతించారు. శ్రీసత్యసాయిబాబా రెండుసార్లు పూలమ్మగారి గృహానికి ఏతెంచి, ఆమె ఒసగిన ఆతిథ్యాన్ని ఆప్యాయంగా స్వీకరించాడు. ఆ ప్రేమమూర్తి, ఆ సాయిమాత 1993 జూలై 28వ తేదీన తెల్లవారు ఝామున (శ్రీముఖ నామ సంవత్సర జ్యేష్ఠా నక్షత్రయుక్త శ్రావణ శుద్ధ ఏకాదశీ పర్వదినాన) గం. 4-52 ని.లకు

తన పాంచభౌతిక కాయాన్ని `ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త' నామస్మరణంతో విసర్జించి సాయినాథునిలో ఐక్యమైంది.

ఆ మాతృశ్రీ పూలమ్మగారికి శ్రీవిశ్వయోగి విశ్వంజీ ప్రసాదించిన అనుభూతులు కోకొల్లలు. ఆమె దృష్టిలో విశ్వయోగి విశ్వంజీ సాక్షాత్తు సాయిదత్త. ప్రతి గురువారం సాయంత్రం శ్రీవిశ్వయోగి విశ్వంజీ. ఆమెకు దర్శనమిచ్చి మాట్లాడుతూ ఉండటం సర్వసాధారణమైన విషయం. విశ్వయోగి విశ్వంజీ పేరు ఆమె ముందు ఎవరైనా ఎత్తినా, లేక తానే వారి పేరు ఉచ్చరించాలనుకొన్నా, ముందుగా పర్యాయాలు "ఓం శ్రీసాయిరాం గురుదేవదత్త" నామాన్ని స్మరించి, నమస్కారం చేసిగాని మాట్లాడేది గాదు. మాస్టరుగారంటే అంత భక్తి ప్రపత్తులు ఆమెకు ఉండేవి. తనను సందర్శించడానికి వచ్చే భక్తబృందానికి మాస్టరుగారిని గురించి చెబుతూ "సాయిదత్త విశ్వమందిరంలో - గుంటూరులో - కొలువు దీర్చాడు నాయనా! నా దగ్గరేముంది? ఆయన దగ్గరకు వెళ్ళి చూచిరాండి" అని చెప్పి పంపిస్తూ ఉండేది.

సాయినాథుని పూజ చేసి, ధ్యానం చేస్తున్న సమయంలో తననెవరో పిలుస్తున్నట్లు పూలమ్మకు అనిపిస్తుండెది. ఏదో శక్తి తననెక్కడికో ఆకర్షిస్తున్నట్లు స్ఫురించేది. ఎవరో - ఎక్కడికో తనను ఈడ్చుకపోతున్నట్లు అనుభూతి కలిగేది. అదేమిటో- ఆ రహస్యం మటుకు ఆమెకు తెలిసేది కాదు - ఎంత ప్రయత్నించినా సమయం వచ్చినప్పుడు అదే అర్థమౌతుంది లెమ్మని తనకు తానే ఆమె సమాధానపడేది.

ఇట్లా ఉంటూ ఉండగా ఒకసారి శ్రీవిశ్వయోగి విశ్వంజీ ఆమెను విశ్వమందిరానికి రావలసిందిగా నండూరుకు కబురు చేశారు. అప్పుడు పూలమ్మ బాబాగారి ఉత్సవాలు జరిపిస్తున్నది. అందువల్ల `ఇప్పుడు రాలే"నని ఆమె తెలియజేసింది. కొన్నాళ్ళు గడిచాయి. ఒకరోజు ఆమె గుంటూరులో ఉన్న తన చిన్న కుమారుడు సీతారామమూర్తి (చిన్నా) ఇంటికి వచ్చింది. ఆ సంగతి తెలిసి మాస్టరుగారు ఆమెను తీసుకొని రమ్మని తమ కారు పంపించారు. ఆమె విశ్వమందిరానికి వచ్చి కళ్ళారా విశ్వయోగిని దర్శించింది. పులకించిపోయింది. మాస్టరుగారు శ్రీఆకుల కోటేశ్వరరావు ఈశ్వరీ దంపతుల చేత ఆమెకు పాదపూజ చేయించి, పట్టుచీర, పట్టురైక పెట్టించి సత్కరించారు. ఆమె దగ్గరకు వచ్చి "నేనెవరో గుర్తించావా?" అని అడిగారు. "ఎన్నాళ్ళనుంచో

నిన్ను రమ్మని పిలుస్తున్నాను. నేనెక్కడ ఉన్నానో నీకు తెలిపాను. నీవు అర్థం జేసుకోలేదు. జన్మజన్మల నుండి మనకు ఆధ్యాత్మిక సంబంధం వుంది. నేనెవరో ఇప్పటికైనా గుర్తించు" అంటూ ఆమె కళ్ళల్లోకి చూచారు. పూలమ్మ తలెత్తి విశ్వయోగి ముఖం వైపు చూచింది. విశ్వయోగి విశ్వయోగిగా కనిపించలేదు. సాయినాథుడిగా గోచరించాడు. ఇంకా అనేక దేవతామూర్తులుగా దర్శనమిచ్చాడు పూలమ్మకు. శ్రీవిశ్వయోగి పాదాలు స్పృశించి ఆమె ఆ పాదమస్తకం పులకించిపోయింది. విశ్వయోగి విశ్వంజీని తొలిసారి దర్శించిననాటి ఆమె దివ్యానుభూతి అది!

కొన్నాళ్ళకు ఆమె రొమ్మున ఒక గడ్డ లేచింది. పొన్నూర్లో ఉన్న డాక్టర్లు ఆమెను పరీక్షించి "కాన్సరేమోనని అనుమానంగా ఉంది. గుంటూరు వెళ్ళి పరీక్ష చేయించుకోవటం మంచి" దని సలహా ఇచ్చారు. హాస్పిటల్లో చేరి వైద్యం చేయించుకోవడం ఆమెకిష్టం లేదు. వెంటనే ఆమె గుంటూరు వచ్చి మాస్టరుగారిని దర్శించింది. విషయమంతా చెప్పింది. మాస్టరుగారు ఆమెకు అభయమిస్తూ "మరేం ఫరవాలేదు. నేను ఒక పసరు పంపిస్తాను. అది కట్టు కట్టించుకో! తగ్గిపోతుంది" అని చెప్పి, ఆమె చేత బాబాకు పూజ చేయించి, హారతి ఇప్పించి, కొత్త చీర, రవిక బట్టలు పెట్టించి వాళ్ళ చిన్నబ్బాయి యింటికి పంపించారు.

ఆనాటి రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో తాము చెప్పినట్లు ముగ్గురు ముత్తైదువుల ద్వారా ఒక ఆకు పసరు ముద్ద ఆయన పూలమ్మకు పంపించారు. వాళ్ళు ఆ పసరు ముద్దను పూలమ్మ వ్రణంపై ఉంచి కట్టుకట్టారు. మొదట కొంచెం మంట అనిపించినా ఆ తర్వాత హాయిగా, చల్లగా ఉన్నట్ల నిపించిందామెకు. వొళ్ళు తెలియకుండా నిద్రపట్టింది. ఉదయం లేచి చూసేసరికి పక్కంతా నెత్తురుతో తడిసిపోయి ఉంది. ఎప్పుడు పగిలిందో? ఏమో? గడ్డ - చీముతో బాటు నెత్తురూ బైటకు వచ్చింది. వాపు తగ్గింది. బాధ చేత్తో తీసిపారేసినట్లు మటుమాయమైంది. క్రమక్రమంగా ఆ గడ్డమానిపోయింది.

ఇంకోసారి - గురుపూర్ణిమ నాడు- ఆమె నండూరులో తీవ్ర జ్వరంతో బాధపడుతూ, బాబా పూజ చేయలేని స్థితిలో నీరసంగా పడి ఉంది. ప్రక్కనే ఉన్న సాయిమందిరంలో యథావిధిగా పూజలు కొనసాగుతున్నవి. సాయినాథుని పల్లకీలో నుంచి ఊరేగించే సమయం ఆసన్నమైంది. మొట్ట మొదట పూలమ్మగారు కొబ్బరికాయ కొట్టి, హారతిచ్చిన తర్వాతనే ఊరేగింపు

ప్రారంభించటం అక్కడి అలవాటు. ఆ ఆనవాయితీకి విరుద్ధంగా ఈ మాటు జరుగుతుందేమో? నన్న భయం ఆమెను పట్టుకొంది. తన కదలలేని స్థితికి చాలా బాధవేసింది. దుఃఖం ముంచుకువచ్చింది. విశ్వయోగిని తలచుకొంది. వెంటనే విశ్వయోగి ఆమె దగ్గరకు వచ్చి, ప్రక్కనే ఉన్న కుర్చీపై కూచోని, ఆమె నుదుట విభూతి పెట్టి, కొంత ఆమె నోట్లో వేసి, "భయపడకు! జ్వరం తగ్గిపోతుంది. బాబాగారికి హారతిచ్చే ఓపిక వస్తుంది" అని చెప్పి అంతర్ధానమయ్యారు. కొన్ని నిముషాలలో ఆమె శరీరమంతా చెమటలు పట్టి జ్వరం తగ్గిపోయింది. ఓపిక వచ్చింది. ఆమె వెంటనే లేచి బాబాగుడికి పోయి స్వహస్తాలతో హారతి ఇచ్చింది.

"ఇది కలకాదు. జాగ్రదావస్థలో - ప్రత్యక్షంగా - జరిగిన సంఘటన" అని ఆమె చెప్పింది జరిగింది వివరిస్తూ. `ఆ గురుపూర్ణిమ రోజు మాస్టరుగారు ఉదయం 8 గంటల నుంచి రాత్రి ఒంటిగంటవరకు గుంటూరు కొత్తపేటలోని అన్నా శ్రీ నివాసరావు కళ్యాణమంటపంలో విశ్వ కుటుంబ సభ్యులు విశ్వమందిరం తరఫున నిర్వహిస్తున్న గురుపూర్ణిమ ఉత్సవాలలో నిమగ్నులై ఉండటం వేలాది భక్తులు చూసిన ప్రత్యక్ష సాక్ష్యం ఉంటే మీ దగ్గరకు వచ్చారని చెబితే నమ్మేదెట్లా?" అని సందేహిస్తూ పలికిన వాళ్ళను చూసి ఆమె "నాది భ్రాంతి కాదు. అబద్ధం చెప్పి మిమ్మల్ని నమ్మించవలసిన అవసరం నాకు లేదు. నా అనుభవానికి నా అంతరాత్మే సాక్ష్యం. ఇప్పుడు మీరెట్లానా దగ్గరికి వచ్చి నాతో మాట్లాడుతున్నారో ఆనాడట్లా ఆయన నా దగ్గరకు వచ్చి, నా ప్రక్కనే కుర్చీలో కూచోని నాతో మాట్లాడారు. వారి మహిమ మీకు తెలీదు. వారు సర్వాంతర్యామి. సాక్షాత్తు సాయిదత్త" అని చెప్పేది.

మరోసారి మరో విచిత్రం జరిగింది. సాయిభక్తులు కొంతమంది మచిలీపట్నంలో నూతనంగా సాయినాథుని ఆలయం నిర్మించి, ఆ తర్వాత అక్కడ `ధుని' ఏర్పాటు చేశారు. బ్యాంకులో పనిచేస్తున్న సాయిభక్తుడు రహీం పూలమ్మగారి దగ్గరకు వచ్చి ``మీ చేతుల మీదుగా ధుని ప్రారంభోత్సవం జరిపించం"డని ప్రార్థించి ఆహ్వానించాడు. `విశ్వయోగి విశ్వంజీ గారు వస్తే నేనూ వస్తాను. వారిని కూడా ఆహ్వానించండి" అని చెబితే ఆయన మాస్టరుగారిని కూడా ఆ ఉత్సవానికి ఆహ్వానించాడు. మాస్టరుగారు ధుని ప్రారంభ సమయానికి తాము వస్తామని పూలమ్మగారిని ముందుగా తీసుకొని వెళ్ళండని చెబితే వారట్లాగే చేశారు. ధుని ప్రారంభోత్సవ

సమయానికి అక్కడుండాలని గుంటూరు నుంచి మాస్టరుగారు కస్తల హనుమంతరావు, ఆకెళ్ళ మాణిక్యమూర్తి ప్రభృతి భక్తగణాన్ని వెంట బెట్టుకొని బయలుదేరారు - కార్లో. దారిలో కుంభవృష్టి పట్టుకొంది. కారు వేగం మందగించింది. అక్కడ మచిలీపట్నంలో ధుని ప్రారంభోత్సవ లగ్న సమయం దగ్గర పడుతున్నది. "ఇంకా మాస్టరుగారు రాలేదేమా?" అని అక్కడి వాళ్ళంతా వాళ్ళంతా కళ్ళు చేసుకొని నిరీక్షిస్తున్నారు. ఇక్కడ కారులో ఉన్న మాస్టరుగారు మాణిక్యమూర్తిని చూసి `టైమెంత అయింది?' అని అడిగారు. ధుని ప్రారంభానికి ఇంకా ఐదు నిమిషాలే ఉంది. ముహూర్తానికి మనమక్కడికి చేరుకోలేం. సుమారు ఇంకో అరగంట పట్టవచ్చు - అక్కడికి చేరుకోవడానికి" అని ఆయన చెబుతుంటే మాస్టరుగారు ఆ మాటలేవీ వినిపించుకోకుండా, ఉన్నవాడున్నట్లే కళ్ళు మూసుకొని ధ్యానంలోకి వెళ్ళిపోయారు నిశ్చలంగా. అక్కడి భక్తులు ముహూర్తం సమీపించటం చూసి, ఇక మాస్టరుగారు రారని నిశ్చయం చేసుకొని, పూలమ్మగారి చేతికి మండుతున్న కట్టెనిచ్చి, ధుని వెలిగించమని కోరారు. ఆమె ఆ కట్టె చేత్తో పట్టుకొని ధుని దగ్గరకు పోయి చూచింది. ధుని కోసం త్రవ్విన గుండం చాలా లోతుగా వుంది. ఎట్లా ధుని వెలిగించాలో ఆమెకు అర్థం గాలేదు. ధుని ప్రారంభ సమయానికి వస్తామని వాగ్దానం చేసిన విశ్వయోగి రాలేదు. ఏం చెయ్యాలో అవగతం గాక కళ్ళు మూసుకొని క్షణకాలం విశ్వయోగిని మనస్సులోనే ధ్యానించింది. నమస్కారం చేసింది. వెంటనే విశ్వయోగి ఆమె ముందు సాక్షాత్కరించారు. ఆమె చేతిలోని కొరివి తన చేతిలోకి తీసుకొని ధునిలోని కట్టెలకు అంటించారు. పూలమ్మ కళ్ళు ఆనందంతో మిలమిల మెరిసినయ్. ఆవునేతితోబాగాతడిసిన కట్టెలు ఒక్కసారి అంటుకొని భగ్గుమని మంటపైకెగసింది. చుట్టూ మూగిన భక్తులు పూలమ్మగారు తన దగ్గరున్న మండుతున్న కట్టెను ఉపయోగింపకయే, తన దృష్టి ప్రసార మాత్రం చేత ధునిలోని కట్టెలను అంటుకొనేటట్లు చేసిందని - ఆ మహిమకు ఆశ్చర్యపోతూ - జయ జయ ధ్వానాలతో కరతాళ ధ్వనులు చేశారు. "పిచ్చివాళ్ళు! నా చేతనున్న కొరివి మీరు తీసుకొని మీరు అంటిస్తే అదంతా నేను చేశాననుకొంటున్నారు - మీ మహిమ వీళ్ళకి తెలీదు" అని ఆ తర్వాత అక్కడికి వచ్చిన మాస్టరుగారితో ఆమె అంది. ఆ మాటలు విని అక్కడున్న వాళ్ళు ఆశ్చర్యపోయారు. "ఎక్కడో తన భక్తుడైన కమ్మరవాని భార్య వొళ్ళో ఉన్న బిడ్డ కొలిమిలో పడిపోతే ఇక్కడ షిర్డీలో ఉన్న బాబా ధునిలో చెయ్యి పెట్టి కాపాడలేదా? మహాత్ములకు సాధ్యం కానిదేమి లేదు. వాళ్ళు తమ ఇచ్ఛాశక్తితో సూక్ష్మరూపం ధరించి తమ కార్యాలు విజయవంతంగా నిర్వహిస్తుంటా"రనే విషయం అక్కడి

సాయిభక్తులకు బోధపడింది. ఇక్కడ కార్లో అంతవరకు మాట్లాడుతున్నవారు చప్పున మౌనం వహించి, కళ్ళు మూసుకొని ధ్యానంలోకి ఎందుకు పోయింది అప్పుడుగాని మాణిక్యమూర్తి ప్రభృతులకు అర్థంగాలేదు.

ఇంకోసారి మాస్టరుగారు పూలమ్మను వెంట దీసుకొని శ్రీ శైలం వెళ్ళి, అక్కడి వింతలూ విశేషాలు ఆమెకు ఎరుకబరిచారు. ఇట్లాంటి అనుభూతులు ఆమె జీవితంలో కోకొల్లలు. ఆమె దృష్టిలో శ్రీసాయి, శ్రీవిశ్వయోగి ఒక్కరే. విశ్వయోగిలో సాయినాధుని దర్శించి, "షిర్డిసాయి విశ్వసాయియైనా"దని స్పష్టం జేసిన పరమ దార్శనిక శిరోమణి. ప్రేమ స్వరూపిణి, సాయిమాత పూలమ్మ.

పూలమ్మగారి ఆరోగ్యం క్షీణించిన విషయం గ్రహించి నందూరుకు పోతున్న ఆమె బంధువుల ద్వారా రెండు ఫలాలు ప్రసాదంగా మాస్టరుగారు పంపుతూ "ఈ ఫలాలను ఆమెనే తీసుకోమనండి - ఎవ్వరికీ ఇవ్వవద్దని చెప్పండి" అని చెప్పి మరీ పంపించారు. పరమేశ్వరుని లీలలు అతి విచిత్రంగా ఉంటాయి. మాస్టరుగారు పంపించిన ఫలాలు ఆమె తినలేదు. దగ్గరున్న ఫలాలలో కలిసిపోయి ఏ భక్తులకో అవి ఇవ్వటం జరిగింది. క్రమక్రమంగా ఆమె దేహం పరిస్థితి విషమిస్తున్న సంగతి ఆమె బంధువులు మాస్టరుగారితో చెబితే వారు "పొన్నూరులో ఆమెకు వైద్య సదుపాయములు సరిగా జరగవు. వాళ్ళ చిన్నబ్బాయి దగ్గరకు గుంటూరుకు - వచ్చి ఉండమని చెప్పండి" అని కబురు చేశారు. కాని ఆమె గుంటూరు రావటానికి పరిస్థితులు అనుకూలించలేదు. "విశ్వయోగి విశ్వంజీని ఒక మారు నా దగ్గరకు వచ్చి చూసి పొమ్మని చెప్పండి" అని ఆమె తన భక్తుల ద్వారా మాస్టరుగారికి విజ్ఞాపనం పంపింది. అది విని మాస్టరుగారు `ఆమె నేను చెప్పినట్లు చెయ్యలేదు. ఈ జన్మలో భౌతికంగా మేము ఒకరినొకరం చూసుకోవటం ఇక జరుగదు. ఇది దైవ నిర్ణయం. మానసికంగా అనుక్షణం నేను ఆమె దగ్గరే ఉంటున్నాను. త్వరలోనే ఆమె వచ్చి ఇక్కడుంటుంది" అని తమ హృదయం చూపిస్తూ పలికారు.

ఆ తర్వాత నాలుగు రోజులకు ఆమె దేహత్యాగం చేసింది. ఆ వార్త విని విశ్వయోగి విశ్వంజీ ఆమె అంతిమ దర్శనానికి విశ్వ కుటుంబం సభ్యులను కొంతమందిని తీసుకొని నందూరు వెళ్ళారు. ఆయన నందూరు వెళ్ళేసరికే `వర్షం వస్తే దహనకార్యానికి ఆటంకం కలుగుతుందేమో!" నన్న

భయంతో ఆమె బంధువులు ఆమె శరీరానికి అంత్యక్రియలు జరిపించారు. మాస్టరుగారి మాటలు యథార్థమైనాయి. మాస్టరుగారు ఆమె భౌతిక కాయాన్ని గూడా చూచే వీలు కలుగలేదు. ఆ సాయిమాత విశ్వసాయిలో విలీనమై, తన భక్తులకు తాను శ్రీవిశ్వయోగి విశ్వంజీ రూపంలో ఉన్నానన్న సత్యాన్ని ఈనాడు వేనోళ్ళ చాటుతున్నది.

శ్రీపూలమ్మగారికి "శ్రీవిశ్వయోగి విశ్వంజీ సాక్షాత్తు సాయినాథులే!" అన్న దర్శనానికి నిదర్శనం తన్మయ రచించిన శ్రీసాయిలీలా తరంగిణి (పూలమ్మగారి జీవితచరిత్ర). ఆ గ్రంథాన్ని తాను అంకితం తీసుకోకుండా - తనకు దివ్యానుభూతులు ప్రసాదించిన శ్రీసాయినాథునకు అంకిత మీయకుండా శ్రీవిశ్వయోగి విశ్వంజీకే అంకితమివ్వవలసిందిగా చెప్పి, అట్లా అంకిత మిప్పించిందంటే ఆమె దృష్టిలో మాస్టరుగారు సాక్షాత్తు సాయినాథులే నన్న విషయం మనకు స్పష్టమౌతుంది. శ్రీరామచంద్రునిగా, సాయినాథునిగా శ్రీవిశ్వయోగి విశ్వంజీని దర్శించి వారి సంపూర్ణాను గ్రహమునకు పాత్రురాలైన శ్రీపూలమ్మగారి జీవితం ధన్యం. అనన్యమైన ఆమె సాయిభక్తి, ఆ మాతృ ప్రేమ లోకానికి ఆశ్చర్య జనకమై ఈనాడు మార్గదర్శకమౌతున్నది.

*(సశేషం)*

*With Best Compliments from*

**M/s. SPECTRA MOTORS LTD.**

Plot No. 8, Begumpet Road, (Opp. I.B.P. Petrol Pumps)
HYDEABAD - 500 016. (A.P.)

***Distributors for A.P.***

**PREMIER AUTOMOBILES LTD.**
BOMBAY, Tel. No. 844034/815017.

# వాల్మీకి రామాయణంలో తాటక

- శ్రీ కనమలూరు వెంకటశివయ్య

*"కియత్ భాగ్యమహోతస్యా స్తాటకాయామహత్తరమ్*
*హతాఽదౌ రామబాణేన ప్రవివేశ దివంఖలు"*

తన యజ్ఞ సంరక్షణార్థం, రామలక్ష్మణులను, విశ్వామిత్రుడు అయోధ్య నుండి తీసుకొని పోతున్నాడు.

సరయూ నదీ దక్షిణ తీరం ముప్పురూ చేరారు. బల, అతిబల అనే మంత్రగ్రామాన్ని, విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు ప్రసాదించాడు. ఆ మంత్ర ప్రభావంచే,

*"న శ్రమో, నజ్వరో వా, తే నరూపస్య విపర్యయః*
*నచసుప్తం ప్రమత్తం వా ధర్షయిష్యంతి నైరృతాః"*

[అలసట కలుగదు. జ్వరం రాదు. ఆకలి దప్పులు ఉండవు. రూపంలో మార్పురాదు. నిద్రలోనున్నా, జాగ్రదవస్థలోనున్నా రాక్షసులు బెదరింపజాలరు.]

ఆ రాత్రి ముప్పురూ, సరయూనదీతీరంలో సుఖంగా ఉండినారు.

మరునాడు, ప్రభాతవేళలో, రామలక్ష్మణులను నిద్రనుండి మేలు కొలిపినాడు, విశ్వామిత్రుడు.

*కౌసల్యా సుప్రజారామ! పూర్వాసంధ్యాప్రవర్తతే*
*ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికం*

ప్రయాణం సాగించారు. త్రోవలో ఒక ఆశ్రమం కనబడింది. ఆ ఆశ్రమంలో, శివునికి, కాముని వలన తపోభంగం అయింది. శివుని కోపాగ్నిలో భస్మీభూతుడై, మన్మథుడు అనంగుడయ్యాడు. ఆ ఆశ్రమం గంగా సరయూ నదుల సంగమ ప్రదేశంలో వుంది. ఆ ఆశ్రమానికి కామాశ్రమం అనే పేరు వచ్చింది. ఆ రాత్రి అచట నిదురించి, మరునాడు బయలుదేరారు.

గంగను నావల సాయంతో దాటారు

గంగా నదీ దక్షిణ తీరం చేరారు.

ప్రయాణం సాగించారు.

భయంకరమైన అర్యణం చేరారు. జనసంచారం లేదు. ఈల పురుగుల రొదలు; భయాన్ని కలిగించే కూ్రరమృగాలు, భయంకరంగా అరచే పక్షులు, ఏనుగులు, సింహాలు, ఉండే అరణ్యాన్ని చూచారు. వివిధములైన వృక్షాలతో దట్టంగా వున్న అడవిని చూచారు

"స్వామీ! ఈ అరణ్యం గురించి చెప్పరా?" అని అడిగారు రామ లక్ష్మణులు.

విశ్వామిత్రుడు ఆ అరణ్యాన్ని గురించి చెప్పాడు.

పూర్వం ఇంద్రుడు, వృత్రుని చంపి, బ్రహ్మహత్యాపాపం పొందినాడు. తపస్సంపన్నులయిన మహర్షులు, దేవేంద్రునికి ఈ ప్రదేశంలో, మంత్ర పూర్వకంగా మంగళ స్నానాలు చేయించి, దేవేంద్రుని పాప విముక్తునిగా చేశారు.

దేవేంద్రుడు సంతోషించి, ఏ ప్రదేశంలో, తాను పరిశుద్ధుడై పాప విముక్తుడయ్యాడో, ఆ ప్రదేశం, మలద, కరూశ నామాలతో ధనధాన్య సమృద్ధములై లోకంలో, యశస్సును అందగలవు, అని వరప్రదానం చేశాడు.

*[ఇమౌ జనపదే స్ఫీతౌ ఖ్యాతింలోకే గమిష్యతః*
*మలదాశ్చ కరూశాశ్చ మమాంగ మల ధారిణౌ]*
మలద కరూశ దేశాలు చిరకాలము సంపన్నంగా ఉండినవి.

కొంతకాలానికి, వేయి ఏనుగుల బలం కల ఒక యక్షిణి పుట్టింది. ఆమె కామరూపిణి. ఆమె పేరు తాటక. ఆమె, సుందుని భార్య. ఆమెకు ఒక పుత్రుడు పుట్టాడు. వాడు దేవేంద్రునితో సమానమయిన పరాక్రమం కలవాడు. బలసిన భూజాలతో, భైరవాకారంతో, గొప్ప పరాక్రమంతో నిత్యం ప్రజలకు ఉపద్రవాలను కలిగిస్తూ వుండినాడు. దుష్టచారిణి అయిన తాటక, ఈ రెండు దేశాలను ధ్వంసం చెయ్యడం కొనసాగించింది.

*[ఇమౌ జనపదౌ నిత్యం, వినాశయతి రాఘవ!*
*మలదాంశ్చ కరూశాంశ్చ తాటకా దుష్టచారిణీ]*

విశ్వామిత్రుడు అన్నాడు. "రామయ్యా! ఈ తాటక ఉన్న వనంలో,

పయనించి, నా ఆశ్రమానికి పోవలసి వున్నది. నా మాట ఆజ్ఞగా స్వీకరించి, ఈ తాటకను చంపి, ఈ ప్రదేశాన్ని నిష్కంటకం చెయ్యి.

*[స్వబాహుబలమాశ్రిత్య జహీమాం దుష్టచారిణీమ్*
*మన్నియోగాదిమందేశం కురు నిష్కంటకం పునః]*

అపుడు రాముడు అన్నాడు.

"స్వామీ! యక్షులు అల్పవీర్యులని వింటాము గదా! మరి - తాటక, సహస్ర నాగబల సంపన్న ఎలా అయింది". విశ్వామిత్రుడు, తాటకా జనన వృత్తాంతం చెప్పాడు.

"నాయనా! రామా! పూర్వం సుకేతుడు అనే శుభాచారుడు అయిన యక్షుడు ఉండినాడు. బిడ్డలు లేని కారణంగా, బ్రహ్మగురించి తపస్సు చేశాడు. బ్రహ్మ, సంతుష్టుడై తాటక అనే కన్యను ప్రసాదించాడు. ఆమెకు వేయి ఏనుగుల బలం ఇచ్చాడు. కాని పుత్రుని మాత్రం ప్రసాదించలేదు.

*[దదౌ నాగ సహస్రస్య బలం చాస్యాః పితామహః*
*నత్వేవ పుత్రం యక్షాయ దదౌ బ్రహ్మ మహాయశాః]*

ఆ తాటక, బ్రహ్మ ఇచ్చిన బలంతోపాటు రూప యౌవనాలను సంతరించుకొనింది. ఆమె తండ్రి, ఆమెను, ఝుర్ఘుని కుమారుడయిన, సుందునకు ఇచ్చి వివాహం చేశాడు. ఆమెకు, దుర్ధర్షుడూ, దుర్మార్గుడూ అయిన, మారీచుడు అనే పుత్రుడు పుట్టాడు.

ఒకప్పుడు, తన భర్త అయిన సుందుడు అగస్త్యునిచే చంపబడగా, తాటక, తన కుమారుని సాహాయ్యంతో, అగస్త్యుని బెదరించి చంపదలచింది. తపస్సంపన్నుడయిన అగస్త్యుడు మారీచుని, రాక్షసుడవు గమ్మని శపించాడు. మారీచుడు రాక్షసుడయ్యాడు.

తాటకనూ శపించాడు.

*"పురుషాదీ మహాయక్షీ విరుపా వికృతాననా*
*ఇదం రూపం విహాయాథ దారుణం రూపమస్తుతే"*

(నరులను తింటూ, అందమైన ఇప్పటి రూపాన్ని వీడి భయంకరమైన రూపం, ముఖం కలిగి వుందువు గాక!)

అగస్త్యుని ఏమీ చెయ్యలేక, అతని మీద కోపంతో, అనాటి నుండీ

ఈ పవిత్ర వనాన్ని ధ్వసం చేస్తూ, నరభక్షణం చేస్తూ, ఉన్నది. అందుకే ఈ వనం నిర్మానుషంగా వుంది.

ఇంతదూరం కథ చెప్పి, విశ్వామిత్రుడు, తాటకను చంపుమని, రామునికి ఉపదేశం చేస్తున్నాడు.

స్త్రీ హత్య చెయ్యరాదని, ప్రజలలో సాధారణంగా, ఉన్న హితోక్తి. తద్భిన్నంగా, తాటకను చంపుమని చెబుతున్నాడు విశ్వామిత్రుడు. రాజుగా, రాజర్షిగా, ఋషిగా మహర్షిగా, బ్రహ్మర్షిగా, జీవితగ్రంథాన్ని, ఆసాంతం, క్షుణ్ణంగా చదివినవాడు విశ్వామిత్రుడు. అతనికి తెలియని ధర్మం లేదు. ధర్మరహస్యం లేదు, న్యాయం లేదు, న్యాయమర్మం లేదు. గోబ్రాహ్మణ హితార్థమై తాటకను చంపుమంటున్నాడు.

*[గోబ్రాహ్మణ హితార్థాయ జహిదుష్ట పరాక్రమమ్]*

ఇచట గోవు అంటే కేవలం, నాలుగు పాదాలు కలిగిన జంతు విశేషం కాదు. గోవు అంటే భూమి అనే అర్థం వుంది. అనగా, జగత్కల్యాణం కోసం, తాటకను వధించు అంటాడు విశ్వామిత్రుడు. తాటక వధింపబడకపోతే, భూలోకంలో మానవజాతే ఉండదు.

గోవు, ఐశ్వర్యానికి సంకేతము. సమృద్ధికి సంకేతం.

అలాగే బ్రాహ్మణ శబ్దము, మేధా సంపద్విజ్ఞానాలకు సంకేతం. జగత్తులో విజ్ఞానైశ్వర్యాలు ప్రబలి వుండాలి. అపుడే జగత్కల్యాణం ఉంటుంది. జగత్కల్యాణ భంజకురాలైన తాటకను వధించడంలో అధర్మం అణువంతా లేదు.

ఇచట తాటకవధ, స్త్రీహత్యగా పరిగణింపబడదు. దుష్టచారిణి అయిన తాటకా సంహారం, ఒక దుష్టురాలిని, మరణదండనతో శిక్షించడం అవుతుంది. శిక్షాస్మృతి కింద, ఒక హంత్రిని (హత్యలు చేసే స్త్రీని) వధించడం, హత్యగా పరిగణింపబడదు. జగత్కల్యాణానికి చేయబడే, ధర్మకర్మమే అవుతుంది.

న్యాయశాస్త్ర పరిధిలో, స్త్రీ అయినా పురుషుడయినా, చేసిన నేరానికి సమంగా శిక్షార్హులు. మన భారతదేశ రాజ్యాంగ చట్టం ప్రకారం (Artical 14 of the constitution) న్యాయం ముందు అందరూ సమానులే. అలాగే IPC (Indian Penal Code) ప్రకారం, ఒకే నేరం చేసిన, స్త్రీ పురుషులకు విధింపబడే దండనలో, స్త్రీలకు ఒక విధంగా, పురుషులకు ఒక విధంగా ఉండదు.

ఇపుడు మనం అమలు చేస్తున్న న్యాయసూత్రాలను, ఆనాడే విశ్వామిత్రుడు ఉద్ఘోషించినాడు.

*నహితే స్త్రీవధకృతే ఘృణా కార్యానరోత్తమ!*
*చాతుర్వర్ణ్య హితార్థాయ కర్తవ్యం, రాజసూనునా*

(లోకోపద్రవం చేసే, ఈ తాటకను వధించు విషయమున స్త్రీ అని దయజూపరాదు)

*నృశంసమనుశంసంవా ప్రజారక్షణ కారణాత్*
*పాతకం వా సదోషం వా కర్తవ్యం రక్షతా సతా*

(ప్రజారక్షణ కారణంగా, కొన్ని కార్యాలలో క్రూరత్వం కనబడినా, వాటిని రాజు చేసి తీరవలసినదే.

ఈనాటి ప్రభుత్వ విధానంలో కూడా **Public Vs Individual** సంఘటనలో, ఏదైనా వివాదం తల ఎత్తినప్పుడు **(Public Interest)** ప్రజా సంక్షేమానికే, ప్రాధాన్యం ఇవ్వబడుతుంది.

అందుకనే, విశ్వామిత్రుడు బల్లగుద్ది చెబుతున్నాడు.

*రాజ్యభారనియుక్తానా మేష ధర్మః సనాతనః*
*అధర్మ్యాం జహి కాకుత్స్థ ధర్మోహ్యస్యా న విద్యతే*

(రాజ్యం నిర్వహించే వారికి ఇది సనాతన ధర్మం. కావున అధార్మికురాలయిన తాటకను వధించు. నీకు ఏ పాపం రాదు.)

న్యాయస్థానంలో, న్యాయవాదులు, చట్టాన్ని న్యాయమూర్తికి నివేదన చేస్తూ, ఇదివరకు న్యాయస్థానాలు ఇచ్చిన తీర్పులను, **Precedents**గా ఎత్తి చూపుతారు. ఆ పద్ధతిలోనే, విశ్వామిత్రుడు, పూర్వం భూదేవినే చంపడానికి పూనుకొన్న, విరోచనుని కూతురయిన మంథరను ఇంద్రుడు చంపిన సంగతి గుర్తుచేస్తాడు. అలాగే, ఇంద్రుడు సజీవంగా ఉండరాదను కోరికతో ఇంద్రుని చంపబూనిన, శుక్రమాత అయిన భృగుమహర్షి భార్యను విష్ణువు సంహరించిన సంగతిని గుర్తు చేస్తాడు.

*శ్రూయతే హి పురా శక్రో విరోచన సుతాం నృప*
*పృథివీం హంతు మిచ్ఛంతీం మంథరా మభ్యసూదయత్*
*విష్ణునాపి పురారామ! భృగుపత్నీ దృఢవ్రతా*
*అనింద్రంలోకమిచ్ఛంతీ కావ్యమాతానిషూదితా*

రాముడు, సుబోధితుడయ్యాడు. తాటకను వధిస్తే స్త్రీ హత్యాపాపం కలుగదని, బాగా తెలుసుకొన్నాడు.

*గోబ్రాహ్మణ హితార్థాయ, దేశస్యాస్య సుఖయచ*
*తవ చైవా ప్రమేయస్య వచనం కర్తుముద్యతః*

"స్వామీ! దేశ సౌభాగ్యం కోసం, విజ్ఞానైశ్వర్యాల నిలబెట్టడం కోసం, నీ వచనం పాటిస్తాను" అన్నాడు రాముడు.

ఇంతలో తాటక రానే వచ్చింది. రాముడు ధనుస్సును సజ్యం చేశాడు. ధనుష్టంకారం ఓక్కులను పిక్కటిల్లజేసింది. తాటక రామునిపైకి పరుగెత్తినది. తాటక, ధూళివర్షం రామలక్ష్మణులపై కురిపించింది. అంతర్థానమై రాళ్లవర్షం కురిపించింది. ఆపై రామునిపైకి వేగంగా వచ్చింది. రాముడు, బాణాలతో ఆమె చేతులను నరికివేశాడు. బాహువులు తెగి, అలసినదై క్రిందబడిపోయినది. లక్ష్మణుడు వెళ్ళి ఆమె ముక్కుచెవులను కోసివేసినాడు.

*"సౌమిత్రి రకరోత్ క్రోధాత్ హృతకర్ణాగ్రనాసికాం"*

(లక్ష్మణుడు, శూర్పణఖ చెవులు ముక్కులు కోసినాడని అందరికి విదితం. కాని తాటక ముక్కు చెవులు కోసినవాడు గూడా లక్ష్మణుడే).

తాటక క్రుద్ధురాలయి, మాయతో వివిధ రూపాలు ధరించి, రామలక్ష్మణులను విభ్రాంతులజేస్తూ, రాళ్లవర్షం కురిపించింది. విశ్వామిత్రుడు అన్నాడు "సాయం సంధ్య సమీపిస్తోంది. రాక్షసులను సాయం సంధ్యలో చంపడం కష్టం. వెంటనే తాటకను చంపు రామా!'' రాముడు, శబ్దవేది కాబట్టి, తాటక ఆటలకు, తన బాణాలతో ఆటకట్టు పల్కాడు. పిడుగువలె విక్రమించి పై బడుతున్న తాటకను, రొమ్ముపై బాణంతో గొట్టినాడు. ఆమె క్రిందపడి అసువులు బాసింది. దేవతలు సంతోషించారు. విశ్వామిత్రుడు ఆశీర్వదించాడు.

రామావతారంలో, రామబాణాగ్నిలో పునీతులయిన వారిలో మొట్టమొదటిది తాటక. ఆహా! తాటక అదృష్టాన్ని ఏమనాలి? రామాయణ గాథలో, రామబాణంచే చంపబడి, స్వర్గం చేరిన మొదటి వ్యక్తి తాటకే గదా!

*"కియత్ భాగ్యమహోతస్యా స్తాటకాయా మహత్తరమ్*
*హతాఽదౌ రామబాణేన ప్రవివేశ దివంఖలు"*

# శ్రీరమణాశ్రమ విశేషాలు

"ఆశ్రమంలో ఒకప్పుడు నాల్గుకుక్కలుండినవి. తాను భుజించనిది అవి ఆహారం ముట్టవన్నారు భగవాన్. పండితులు పరీక్షించారు. వాని ఎదుట ఆహారముంచారు. కాని అవి దానిని చూడలేదు. కొంతసేపైన పిదప భగవాన్ ఆ ఆహారంలోనుంచి చిన్న కబళం తీసి నోట వేసుకున్నారు. క్షణంలో అవి ఆహార్నానంతా కబళించి వేశాయి.

"మరికొంత సేపటికొకరు రెండు నెమళ్ళను తీసుకొని సన్నిధికి వచ్చారు. ఆ నెమళ్ళకు కన్నులు గంతకట్టి వున్నాయి. భగవాన్ ఎదుట ఆ గంతలు విప్పివానిని వదిలారు. అవి కొంతదూరానికి ఎగిరి పోయినవి. వానిని పట్టి మళ్ళీ భగవాన్ ఎదుటనుంచారు. మళ్ళీ అవి దూరంగా పోయినవి. భగవాన్ అన్నారు. "వానినిచ్చట నిలువయత్నించటం వృధా. వాని మనస్సు ఆ కుక్కలకు వలె పక్వం కాలేదు ". వాళ్ళెంత యత్నించినా ఆ నెమళ్ళచ్చట క్షణమైనా నిలువలేదు.

శ్రీరమణాశ్రమంలోని సంఘటనలు -
"శ్రీరమణభాషణములు "-అనే గ్రంథంనుంచి.
ఆంగ్ల సంకలనము: శ్రీరమణానంద సరస్వతి
ఆంధ్రానువాదము: శ్రీరామచంద్రకొండిన్య -
ప్రచురణ-శ్రీరమణాశ్రమం: పుట 120- (1980)

With best compliments from

**FULL MOON SERVICE STATION**

**INDIAN OIL DEALDERS**

***Head Office :***
6-3-873, Begumpet, Hyderabad -500 016
Off : 212618, Res. : 35489, 220013

***Branch :***
Hyderabad - Bombay Highway,
Miyapur, R. R. Dist. Phone : 17

# హృదయవిద్య

*- శ్రీజిల్లెళ్ళమూడి 'నాన్న'గారు*
*(నాన్నగారి ప్రవచనముల నుంచి)*

రమణమహర్షిగారు చెప్పినది హృదయవిద్య. శాస్త్ర చర్చలతో సంబంధములేకుండా సూటిగా హృదయంలోనికి పంపించటంకోసం వచ్చిన అవతారం ఆయన. అవసరమైన శాస్త్ర చర్చలకు, వాదోపవాదములకు వెళ్లకుండా సూటిగా జీవుడిని హృదయ గుహలోనికి పంపటానికి భగవాన్ ఎక్కువగా ప్రయత్నం చేసారు. నీ హృదయంలోనే చైతన్యం వుంది. నీ హృదయమే నీ స్వరూపము. స్వరూపం శక్తిలేకుండా లేదు. స్వరూపం జ్ఞానం లేకుండా లేదు. నీ స్వరూపంలోనే జ్ఞానం వుంది. ఆనందము వుంది. అందుచేత నీవు ఎవరో నీవు తెలుసుకోవటం మంచిది. మానవుడికి వాడు ఎవడో తెలియకపోవటం బంధము. వాడు ఎవడో తెలిస్తే అది మోక్షము. బంధము నీకు బయట లేదు. నీలోపలే వుంది.

భగవాన్ భక్తులలో కుంజుస్వామి ఒకరు. "నేను ఎక్కడికి వెళ్ళినా శాస్త్రముల గురించి అడుగుతున్నారు. భగవాన్ ఏమి చెప్పారు అని అడుగుతున్నారు. నేను చెప్పలేకపోతున్నాను. అందుచేత భాషలు నేర్చుకోవాలని అనుకొంటున్నాను. శాస్త్రములు చదవాలనుకొంటున్నాను" అని కుంజుస్వామి భగవాన్‌తో చెప్పారు. నీవు ఎన్ని భాషలు నేర్చుకొంటావు? ఎన్ని శాస్త్రములు చదువుతావు. ఇలా నీకు కొన్ని వేలజన్మలు వెళ్ళిపోతాయి. ముందు నీవు ఎవడివో నీవు తెలుసుకో. నీవు ఎవడివో నీవు తెలుసుకొన్నాక ఇంకా తెలుసుకోవలసిన విషయములు మిగిలివుంటే అప్పుడు తెలుసుకోవచ్చును. ముందు నీవు ఎవడివో నీవు తెలుసుకోవటానికి ప్రయత్నించు. నీవు ఎవడివో నీవు తెలుసుకొన్నాక నీద్వారా సమాజము ఉద్ధరించబడుతుంది. ముందు నీకు పవిత్రత కలిగితే సమాజం కూడా పవిత్రం అవుతుంది. సమాజం నీకు వేరుగాలేదు.

ఆలోచన అనేది ప్రారంభిస్తే నీ మేధస్సుకంటే అతీతమైన శక్తి ఒకటి వుంది అని నీకు తెలుస్తుంది. దీనికి కొంతసాధన ఉండాలి. మనోనిగ్రహం వుండాలి. వినయం ఉండాలి. మేధస్సును ఉపయోగించి బాహ్య విషయములను, ప్రకృతి విషయములను ఆలోచిస్తూ వుంటే ప్రకృతి రహస్యాలు కొన్ని తెలుస్తాయి. ఈ మేధస్సును హృదయంలో నిలబెట్టి ఉంచితే ఆత్మజ్ఞానము

కలుగుతుంది.

అంతర్ముఖం, బాహ్యాముఖం గురించి అడుగుతూ ఉంటారు. నీ మనస్సును దాని పుట్టుస్థానమైన హృదయంలో నిలబెట్టి ఉంచటమే అంతర్ముఖం. నీ మనస్సు కనుక హృదయంలో ఉంటే అది అంతర్ముఖం. నీ మనస్సు హృదయంలో ఉండకపోతే నువ్వు బాహ్యాముఖంలో ఉన్నట్లే. విడిగా చెప్పనక్కరలేదు.

మన దుఃఖానికి కారణము మనస్సు. మన బంధానికి కారణం మనస్సు. పూర్వజన్మ వాసనలు మనస్సులో ఉన్నాయి. రాబోయే జన్మకు హేతువులు మనస్సులో వున్నాయి. మనస్సును విడిచిపెట్టి బంధములేదు. మనస్సును విడిచిపెట్టి అజ్ఞానములేదు. నీవు, నేను అనే భేదబుద్ధిని కల్పించేది కూడా మనస్సే. దేవుడిని కూడా మనస్సే కల్పించింది. అందుచేత మనస్సు ఉదయించటం వలన ఏవైతే వస్తున్నాయో మనస్సు అణిగిపోవటం వలన అవి అన్నీ అణిగిపోతాయి.

ఇప్పుడు మనకు అసత్యమైన నేను వ్యక్తమవుతోంది. ఎక్కడైతే అసత్యమైన నేను దానికి సంబంధించిన రాగద్వేషములు, ప్రకృతి గుణాలు కాలి బూడిద అవుతాయో అక్కడనుండి సత్యమైన నేను ఉద్భవిస్తుంది అని భగవాన్ చెప్పారు. అసత్యమైన నేను శిరస్సులో అణగదు. అసత్యమైన నేను హృదయంలో అణుగుతుంది. అసత్యమైన నేను ఎక్కడయితే అణిగిపోయిందో అక్కడే సత్యమైన నేను నీకు వ్యక్తమవుతుంది. అసత్యమైన నేనుకు పరిమితులు ఉన్నాయి. అది దేశకాలములకు లోబడి వుంటుంది. నిజమైన నేనుకు పరిమితులు లేవు. అది ఎప్పుడూ ఉంటుంది. ఏకంగా వుంటుంది, నిదానంగా వుంటుంది. శాంతంగా వుంటుంది. నిజమైన నేను ఉపాధిరహితము. ఎప్పుడూ ఉండటమే దాని పని. నిజమైన నేను అంటే ఎవరో అనుకొంటున్నావేమో అది నీ స్వరూపమే. అది నీకు ఎప్పుడైతే వ్యక్తమయిందో అప్పుడు నీ హృదయంలో ఉన్న శాంతి సముద్రము, ఆనంద సముద్రము నీ సహస్రారమునకు అందుతుంది.

నీలోపల ఉన్న సద్వస్తువు పరమ పవిత్రమైనది. అది పూర్ణమైనది. అది ఎంత పవిత్రమైనదో నీవు కూడా అంత పవిత్రతను సాధిస్తే అది నీకు వ్యక్తమవుతుంది. నీలోపల ఉన్న సత్యవస్తువు సజీవముగా ఉంది. అది ఉందా, లేదా అనే అనుమానం అక్కరలేదు. బాహ్యంగా ఉన్న శత్రువులకంటే నీలోపల ఉన్న శత్రువులే నీకు ఎక్కువ అపకారం చేస్తారు. నీ రాగద్వేషములే ఎక్కువ అపకారం చేస్తాయి. అందువలన ముందు నీ లోపల ఉన్న

# దివ్యయోగి చరితామృతం - శ్రీసదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి (1560-1750)

- ఆచార్య బి. రామరాజు

ఆంధ్ర సాతవాహనుల పరిపాలన నాటినుండే ఆంధ్రులు దక్షిణ దేశానికి వలసలు పోతున్నా విజయనగర రాజులు, తెలుగు నాయకులను చోళ (తంజావూరు) పాండ్య (మదుర), తుండీర (చెంజి) రాజ్యాలలో తమ ప్రతినిధులుగా నిలిపిన నాటినుండి అరవ దేశంలో ఆంధ్రుల వలస లెక్కువైనవి. ఆంధ్రదేశం నుండి వలసపోయిన అష్టాదశవృత్తులవారు ఆయా రాజాస్థానాలలో స్థిరపడ్డారు. ఇట్లా స్థిరపడ్డ ఆంధ్ర బ్రాహ్మణులలో చాలామంది రాయలసీమ ములికినాటివారు. కర్నూలు మండలం మోక్షగుండం గ్రామం నుండి పోయిన ములికి నాటివారికి అక్కడ మోక్షగుండం లేదా మోక్షం అనే యింటిపేరు వచ్చింది. తంజావూరు శాహాజీ మహారాజు (1684-1712) చేత తిరువిశనల్లూరు అగ్రహారం (1693) పొందిన 46 మంది పండితుల్లో మోక్షం సోమసుందరం అవధానిగారు ఒకరు. ఆయన భార్య పార్వతీదేవి. ఆ దంపతులు మదురలో ఉండగానో, తిరువిశనల్లూరులో ఉండగానో వారి పుణ్యం చాలాకాలానికి పండి ఒక కొడుకు పుట్టినాడు. అతనికి శివరామకృష్ణయ్య అని పేరు పెట్టినారు. లేక లేక కలిగిన సంతానమో లేదా పోగా మిగిలిన సంతానమో కావటం చేత శివరామకృష్ణయ్యకు భిక్షుగుప్తుడనే మరొక వాడుక పేరుండేది. ఈ భిక్షుగుప్తుడే తరువాతి కాలాన శ్రీశుకుని బ్రాహ్మీమయస్థితి, జడభరతుని వైరాగ్యం, ఋషభదేవుని తపస్సు పుణికి పుచ్చుకున్న అవతారం శ్రీసదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి.

సదాశివ బ్రహ్మేంద్రుల కాలం ప్రొ.వి. రాఘవన్ 1750 అనీ, కృష్ణాజీ త్రివేది 1690 అనీ, బాలాంత్రపు రజనీ కాంతరావు 1830-1887 అనీ, ఆర్. కృష్ణమూర్తి 1738 అనీ, మేడపాటి వెంకటరెడ్డి 1638-1738 అనీ ఊహించినారు. కంచి కామకోటి పీఠం 57వ జగద్గురువులు పరమ శివేంద్రులు -II (1539-1586) సదాశివ బ్రహ్మేంద్రులకు దీక్ష ఇచ్చిన కారణ గురువులు కావటం చేత, పుదుక్కోట రాజు విజయ రఘునాథ తొండమాన్ (1730-1769)కు, సదాశివ బ్రహ్మేంద్రులు 1738 సంవత్సరం మంత్రోపదేశం చేసినది చారిత్రక

సత్యం కావటం చేత సదాశివ బ్రహ్మేంద్రుల కాలం 1560-1750 కావచ్చునని నేను ఊహిస్తున్నాను. త్రైలింగస్వామి 280 ఏండ్లు జీవించినారు, సొరకాయల స్వామి 202 ఏండ్లు బ్రతికినారు. సిద్ధపురుషులు తమ యిచ్చ వచ్చినంతకాలం బ్రతుకుతారు.

శివరామకృష్ణయ్యకు బాల్యంలోనే వివాహం జరిగింది. ఆయన శుక్ల పక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడై 15 ఏండ్ల ప్రాయానికే సమస్త విద్యలు నేర్చినాడు. తిరువిశనల్లూరు గురుకులంలో ఆయన సహాధ్యాయులు రామభద్ర దీక్షితులు, శ్రీ ధర వెంకటేశ అయ్యావాళ్, గోపాలకృష్ణశాస్త్రి ప్రభృతులు. తర్కం, వ్యాకరణం, శ్రుతిస్మృతులు శివరామకృష్ణయ్యకునూ కరతలామలకములు, సంగీత సాహిత్యాలు కుడియెడమల చేదోడు వాదోడులు. బాల్యం నుండే భక్తి రసామృతపానం చేస్తుండిన శివరామకృష్ణయ్యకు నూనూగుమీసాలు వస్తుండగా జీవితం మరోవైపు మలుపు తిరిగే విచిత్ర సంఘటన జరిగింది. గురుకులంలో చదువుకుంటున్న దినాల్లో పొరుగూరిలో ఆయన భార్య సమర్త ఐనట్లు గురుసన్నిధికి వార్త వచ్చింది. గురువు ఆజ్ఞమేరకు శివరామకృష్ణయ్య ఎండలో నడచి అలసి సొలసి ఆకలికి నకనకలాడే కడుపుతో అత్తవారిల్లు చేరినాడు. పనుల తొందరలో వున్న ఆయింటి వారాతణ్ణి గురించి పట్టించుకోలేదు. భరింపరాని ఆకలి అవమానాల గునపం పోటులతో శివరామకృష్ణయ్య హృదయంలో దాగి ఉన్న వైరాగ్య నిధి నిక్షేపాలు పైకుబికినవి. ఆయనకు సంసారంపై విరక్తి పుట్టింది. వెనుదిరిగి అడవులూ దివ్యతీర్థాలు తిరుగుతూ, లభించింది తింటూ గురువు కోసం అన్వేషించసాగినాడు. తిరిగి తిరిగి కాంచీపురం చేరినాడు. అక్కడ కాంచీ జగద్గురు పీఠానికి 57వ అధిపతులు పరమ శివేంద్రులను (1538-1586) దర్శించి సన్న్యాస దీక్షకై ప్రార్థించినాడు. శివరామకృష్ణయ్య విద్యావైదుష్యము, దృఢమైన వైరాగ్యస్థితి గమనించి పరమ శివేంద్రులు ఆయనకు సన్న్యాసమూ సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి అనే దీక్షానామం ప్రసాదించినారు. సదాశివ బ్రహ్మేంద్రులు కారణ గురువుల సన్నిధిలో 6 ఏండ్లు సమస్త వేదాంత గ్రంథాలు అధ్యయనం చేసినారు. పూర్వ జన్మసుకృతం, అవిచలిత నిశ్చయబుద్ధి పరిణత మేధాసంపత్తి, నిరంతర సాధనల మూలంగా సదాశివ బ్రహ్మేంద్రులు మహాపండితులుగా గొప్ప యోగిగా పరిణతి చెందినారు. త్వరితగతిలోనే ఆయనకు అద్వైతసిద్ధి, వెనువెంటనే యోగసిద్ధి ప్రాప్తించినవి. శిష్యుని ఆధ్యాత్మికోన్నతికి పరమ శివేంద్రులకు పరమసంతోషం కలిగింది.

అద్వైత సాహిత్యచరిత్రలో సదాశివ బ్రహ్మేంద్రులది విశిష్టస్థానం,

గురువుల ఆనతితో వారు పతంజలి బ్రహ్మసూత్రాలకు బ్రహ్మతత్త్వ ప్రకాశికావృత్తిని, యోగ సూత్రాలకు యోగ సుధాకరవృత్తినీ, ద్వాదశోపనిషత్తులకు దీపికా వ్యాఖ్యానాలు రచించినారు. ఈ గ్రంథాలన్నింటిలో వారు తమ గురువులను స్మరించినారు. ఇంకా శివయోగ ప్రదీపిక, ఆత్మ విద్యా విలాసం, ఆత్మానాత్మ వివేకం, ఆత్మానుసంధానం, స్వానుభూతి ప్రకాశికా, బ్రహ్మామృతవర్షిణీ, దక్షిణామూర్తి ధ్యానం, కైవల్యోపనిషద్దీపికా, మహావాక్యార్థ సాధన, మనీషా పంచకంపై తాత్పర్యదీపికా, ఆత్మపంచకం పై సారికా, సర్వవేదాంత సార సంగ్రహం, సిద్ధాంతలేశ సంగ్రహంపై సిద్ధాంత కల్పవల్లీ, శివమానసపూజా, అద్వైత రసమంజరీ, భాగవత సంగ్రహం, సూత సంహితాసార సంగ్రహం, మొదలైన చాలా గొప్ప గ్రంథాలు రచించినారు. ఆ గ్రంథాల వైశిష్ట్యము, యోగ రహస్యాలు మేడపాటి వెంకటరెడ్డి స్థాలీ పులాకంగా చెప్పినారు. సదాశివ బ్రహ్మేంద్రులు సృష్టించినచో ఈ వాఙ్మయమంతా సంస్కృతంలో ఉండటం చేత సాధారణులకు అందుబాటులో లేదు. ఇటీవలే మళయాళస్వామి ఏర్పేడు ఆశ్రమంవారు యోగసుధాకర వృత్తికి, శివయోగ ప్రదీపిక తెలుగు అనువాదాలు. కాళహస్తి శుకబ్రహ్మాశ్రమంవారు ఆత్మవిద్యావిలాసానికి తెలుగు అనువాదం ప్రకటించినారు. ఆత్మవిద్యావిలాసం 65 శ్లోకాల గ్రంథం, సదాశివ బ్రహ్మేంద్రుల స్వానుభవం. ఒక ఆత్మజ్ఞాని స్థిత ప్రజ్ఞుడైన సత్పురుషుని లక్షణాలు అనుభవాలు చక్కగా చిత్రిస్తుందీ కృతి. ఇందులోని మొదటి 10 శ్లోకాలు తమ గురువుల పరమ శివేంద్రుల అనుగ్రహ వైభవానికి దర్పణాలు.

సదాశివ బ్రహ్మేంద్రుల ఈ గ్రంథాలన్నీ ఒక యెత్తు. ఆయన రచించిన సంకీర్తనలు మరొక యెత్తు. వేదాంత గ్రంథాలు, వేదాంత జిజ్ఞాసువులకే పరిమితం, కాని భజనకూటాలవారి మూలంగా, గాయకుల మూలంగా, ఆకాశవాణి మూలంగా సదాశివ బ్రహ్మేంద్రుల భక్తి సంగీతకృతులు సాధారణజనులకు కూడా అందుబాటులోనికి వచ్చినవి. వారు రచించిన అనేక సంగీత కృతుల్లో 23 మాత్రమే మనకు దక్కినవి. ఇందులో మొదటి 12 సగుణ బ్రహ్మ సంకీర్తనలు. మిగతా 11 నిర్గుణ బ్రహ్మ సంకీర్తనలు. ఈ పాటలన్నింటిలోను `పరమహంస' లేదా `హంస' అనే ముద్ర ఉంటుంది. 1) భజరే గోపాలం 2) స్మర వారం వారం 3) బ్రూహి ముకుందేతి 4) మానస సంచరరే బ్రహ్మణి 5) గాయతి వనమాలీ 6) క్రీడతి వనమాలీ 7) భజరే యదునాథం 8) భజరే రఘువీరం 9) ప్రతి వారం వారం 10) చేతః శ్రీ రామం చింతయ11) పిబరే రామరసం 12) ఖేలతి మమ హృదయే

13) ఖేలతి పిండాండే 14) స్థిరతా నహి నహి రే 15) నహి రే నహి శంకా 16) చింతా నాస్తి కిల 17) బ్రహ్మైవాహం కిల 18) సర్వం బ్రహ్మమయం 19) తద్వ్యజ్జీవత్వం బ్రహ్మణి 20) పూర్ణబోధోఽహం 21) ఆనంద పూర్ణబోధోఽహం సతతం 22) ఆనంద పూర్ణ బోధోఽహం 23) జయ తుంగతరంగే గంగే అనేవి ఆ పాటల ప్రారంభాలు. దాక్షిణాత్య భజన కూటాల్లో ఈ సంకీర్తనలు నిర్దిష్టమైన రాగతాళాల్లో ఇప్పటికీ తప్పునిసరిగా పాడుతుంటారు. సంగీత విద్వాంసులు ఇందులో రెండు మూడైనా తమ కిష్టమైన రాగాల్లో పాడుతుంటారు. సదాశివ బ్రహ్మేంద్రుల భగవన్నామ సంకీర్తనలు శ్రుతిసుభగంగాను, భావ భరితంగాను ఉంటాయి. ఒక సగుణ బ్రహ్మ సంకీర్తనం -

సురుటి - ఆదితాళం

"బ్రూహి మకుందేతి రసనే - బ్రూహి ముకుందేతి ||బ్రూహి||
కేశవ మాధవ గోవిందేతి - కృష్ణానంద సదానందేతి ||బ్రూహి||
రాధారమణ హరే రామేతి - రాజీవాక్ష ఘనశ్యామేతి ||బ్రూహి||
గరుడగమన నందక హస్తేతి -ఖండిత దశకంధర మస్తేతి ||బ్రూహి||
అక్రూర ప్రియ చక్రధరేతి - హంస నిరంజన కంసహరేతి" ||బ్రూహి||

ఒక నిర్గుణ బ్రహ్మ సంకీర్తనం -

కాంభోజి - ఆదితాళం

"చింతా నాస్తి కిల - తేషాం - చింతానాస్తికిల
శమదమ కరుణా సంపూర్ణానాం-సాధుసమాగమ సంకీర్ణానాం ||చింతా||
కాలత్రయ జితకందర్పాణాం-ఖండిత సర్వేంద్రియ దర్పాణాం ||చింతా||
పరమహంస గురుపద చిత్తానాం-బ్రహ్మానందామృత మత్తానామ్ ||చింతా||

సదాశివ బ్రహ్మేంద్రులు కామకోటి పీఠాధీశుల సన్నిధిలో ఉన్న దినాల్లో జగద్గురువులను దర్శించటానికి వచ్చే నానా దేశ పండితులతో ఆయనకు పరిచయం కలిగేది. ఆ దినాల్లో ఆయన ప్రతిభా పాండిత్యాలు ఒడ్డు లొరుసుకొని పారెవి. ఆయా పండితులతో వేదాంత చర్చలు చేస్తూ వాదిస్తూ వారిని ఓడించేవారు. జగద్గురువులకు ఈ విషయం తెలిసి సదాశివ బ్రహ్మేంద్రులను పిలిపించి "నీవు వాఙ్నియమమెప్పుడు చేసుకుంటావు?" అని మెత్తగా మందలించినారు. సదాశివ బ్రహ్మేంద్రులు "ఇప్పటి నుండే మౌనం పాటిస్తాను" అని శపథం చేసి జీవితాంతం అసిధారగా మౌనవ్రతం

పాటించినారు. అటు తరువాత గురువుగారి సెలవంది కొండలు కోనలు నదీనదాలు పరిక్రమిస్తూ, శీతాతపములు క్షుత్పిపాసలు మానావ మానములు పరిగణించక జడభరతుని వలె సదా బ్రహ్మభావనలో సంచరించేవారు. ఆయన పొందిన ఆవధూత స్థితి విన్న జగద్గురువులు శిష్యుడు పొందిన ఉన్నతావస్థను తాము పొందలేకపోతిమే అని చింతించేవారట. సదాశివ బ్రహ్మేంద్రులు తండ్రిని మించిన కొడుకు, గురువును మించిన శిష్యుడు. అష్టసిద్ధులు అనేక యోగ విభూతులు ఆయన కనుసన్నల్లో మెలిగేవి. దక్షిణ దేశం రాజాస్థానాల రికార్డుల్లో ఉన్న వారి మహిమలతో పాటు సాధారణ ప్రజానీకంలో ప్రచారంలో ఉన్న అద్భుతాలనేకం. అట్టివాటిలో కొన్ని:

1) ఒకసారి సదాశివ బ్రహ్మేంద్రులు గ్రామాల పొలిమేరల్లో తిరుగు హ ఒక పొలం గట్టుపై తల ఆన్చి నిద్ర పోతుంటే పొలం యజమాని గమనించి "సర్వస్వం త్యజించిన సన్న్యాసికి కూడా తలగడ కావలసి వచ్చిందే" అన్నాడట. అది విన్న స్వామి తమ యోగశక్తులు రైతుకు ప్రదర్శించే ఉద్దేశంతో మరునాడు ఆ చోటనే గాలిలో తేలుతూ నిద్రించినారట. ఈ దృశ్యం చూచిన పొలం యజమాని "ఒక్కొక్కడు యోగియైనా అహంకారం పోదు గదా!" అన్నాడట. ఆ మాటలు విన్న సదాశివ బ్రహ్మేంద్రులు భగవంతుడే రైతు రూపంలో వచ్చి తమ అహంకారం తొలగించి అనుగ్రహించినాడని కృతజ్ఞతలు తెలిపినారట.

2) సదాశివ బ్రహ్మేంద్రులొకసారి కోడుమూడి సమీపంలో కావేరీ తటాన సమాధిస్థులై ఉండగా వరదలు ముంచెత్తినవి. వారు ఇసుకలో పూడుక పోయినారు. మూడు నెలల తరువాత అక్కడి కర్షకులు ఇసుక మేటలు తవ్వుతుండగా అందులోనుండి స్వామివారు బయటపడి ఏమీ జరుగనట్లు కదలిపోయినారట.

3) ఒకరాత్రి సదాశివ బ్రహ్మేంద్రులు నెరూరు గ్రామం బయటి పొలంలో ఉన్న ఒక కళ్ళం వద్ద తిరుగుతుంటే కావలివారు ఈయన ధాన్యం దొంగిలించ వచ్చినాడనుకొని కొట్టటానికి చేతులెత్తినారు. ఎత్తిన చేతులెత్తినట్లే ఉండివారు స్తంభించిపోయినారు. సదాశివబ్రహ్మేంద్రులు ఆ రాత్రి ధాన్యరాశి వద్దనే ఉన్నారు. తెల్లవారి భూస్వామి వచ్చి విషయం గ్రహించి స్వామి కాళ్ళపై పడ్డాడు. స్వామివారచ్చోటు నుండి కదలిపోయిన తరువాత స్తంభించిపోయిన కావలివారికి కదలిక వచ్చింది.

4) జీవన్ముక్తులైన అవధూత స్థితిలో స్వామివారు తిరుచిరాపల్లిలో ఒక ముస్లిం నవాబు గుడారం చొచ్చి ఘోషా స్త్రీలున్న వైపు పోతుంటే కుపితుడైన నవాబు కత్తితో స్వామి భుజం నరికినాడు. భుజం తెగి వ్రేలాడుతున్నది. రక్తం ధారలుగా చిమ్ముతున్నా నిర్బాధగా ఏమి పట్టనట్లు స్వామి వెనుదిరిగి పోతుంటే ఆయన ఎవరో మహాత్ముడై ఉంటాడని గుర్తించిన నవాబు స్వామి కాళ్ళపైన బడి క్షమాభిక్ష వేడినాడు. ఆతని ప్రార్థన విని స్వామి స్పృహలోనికి వచ్చి భుజం తడుముకున్నాడు. చేయి ఎప్పటివలె అతుక్కుపోయింది. నవాబును క్షమించి స్వామి సాగిపోయినారు.

5) సదాశివ బ్రహ్మేంద్రులు కరూరు వీథుల్లో తిరుగుతుంటే చిన్న పిల్లలు ఆయన చుట్టూ మూగి వెన్నంటి పోయేవారు. గృహస్థులు తమకిచ్చే తిను బండారాలు స్వామి ఆ పిల్లలకిచ్చి సంతోషించేవారు. పిల్లలతో ఆడుతూ పాడుతూ నవ్వుతూ వారి కోరికలు తీర్చేవారు. మదుర మీనాక్షి సోమ సుందరేశ్వరుల ఆలయంలో ఉత్సవాలు జరుగుతున్న దినాలవి. ఆనాటి వృషభ వాహనం చూడ ముచ్చటపడిన పిల్లలు తమను మదురకు తీసుకపొమ్మని స్వామిని కోరినారు. స్వామి తమను పట్టుకొని కండ్లు మూసుకోండని పిల్లలను ఆదేశించినారు. వారట్లే చేసినారు. తత్ క్షణమే వారంతా మధురలో ఉన్నారు. ఉత్సవం వేడుకలు చూసి స్వామిని పట్టుకొని కండ్లు మూసుకొని కరూరు తిరిగి వచ్చి ఆ పిల్లలు ఈ అద్భుతం తమ తల్లిదండ్రులకు చెప్పినారు.

6) తిరుచునాపల్లి జిల్లా ఒక గ్రామంలో జిల్లా అధికారులు వచ్చి భూమిశిస్తు వసూళ్ళ పని పర్యవేక్షిస్తున్నారు. వారికోసం గ్రామాధికారులు ఒకచోట వంటలు చేయిస్తున్నారు. వేరొక చోటు నుండి పాకశాలకు వంట చెరుకు మోపులు వెట్టివాండ్ల చేత మోయిస్తున్నారు. అవధూత స్థితిలో పిచ్చివానివలె ఆ సమీపంలో సదాశివ బ్రహ్మేంద్రులు తిరుగుతుంటే ఎవరో అమాయికుడనుకొని ఆయన చేత కూడా వెట్టిచాకిరీ చేయించి కట్టెలు మోయించినారు. స్వామి కిమ్మనకుండా ఆ కట్టెల మోపు వంటలు చేసే చోట పడవేసినారు. ఒక్కసారి ఆ కట్టెల మోపులు భుగ్గుమన్నవి, వంట పాక కూడ కాలిపోయింది. ఒక మహాత్ముని అవమానించినామని అప్పుడు గుర్తించిన అధికారులు స్వామిని క్షమాభిక్ష వేడుకున్నారు.

7) నెరూరులో సదాశివ బ్రహ్మేంద్రులు సంచరిస్తుండిన దినాల్లో రామలింగశాస్త్రి అనే నిరక్షరాస్యుడు స్వామిని సేవిస్తూ వెంట తిరిగేవాడు.

స్వామి అనుగ్రహంతో అతడు గొప్ప పౌరాణికుడైనాడు. దివ్యశక్తి మూగను వాచాలుణ్ణి చేస్తుంది కదా! ఆ పౌరాణికునికి గొప్ప పేరు వచ్చింది. ఇంటిపేరు ఆకాశ పురాణంవారైనది. ఆయన సంతతివారిప్పటికీ నెరూరులో ఈ కథ చెప్పుతుంటారు.

8) తంజావూరు ఏలిక శరభోజిమహారాజు (1711-1729) ఆస్థాన విద్వాంసుడు, గురువు, మలహరి పండితుడు సదాశివ బ్రహ్మేంద్రులను దీపాంబాపురం పొలిమేరల్లో దర్శించి తన ప్రభువునకు సంతాన భిక్ష యాచించినాడు. స్వామివారు దీవించి తమ ఆత్మవిద్యా విలాసం గ్రంథం ప్రసాదంగా ఇచ్చినారు. మలహరి పండితుడు ప్రభువు పక్షాన స్వామికి మూడు భిక్షలు చేసి ధన్యుడైనాడు.

తంజావూరు మదుర చెంజివలె పుదుక్కోట కూడ తెలుగు నాయకులేలిన తమిళ రాజ్యం. సదాశివ బ్రహ్మేంద్రులు పుదుక్కోట సంస్థానం గ్రామాల్లో అడవుల్లో ఎక్కువగా తిరిగేవారు. స్వామివారు తిరువేరంగుళం ప్రాంతాటవుల్లో తిరుగుతుండగా విజయ రఘునాథ తొండమాన్ రాజు (1730-1769) వచ్చి దర్శించి తనకు సత్సంతానం కోసం తన రాజ్యం శాంతి సుభిక్షంగా ఉండటానికోసం స్వామిని ప్రార్థించినాడు, తనను శిష్యుడుగా స్వీకరించవలసిందని ప్రార్థిస్తూ 8 ఏండ్లు సేవించినాడు. ఆ రాజు భక్తికి వినయ సంపదకు సంతసించి స్వామివారు ఆయనను శిష్యుడుగా అంగీకరించి దక్షిణామూర్తి మంత్రం ఇసుకపై వ్రాసి (1738) ఉపదేశించినారు. రాజుగారా ఇసుకనట్లాగే ఎత్తించి బంగారు పెట్టెలో భద్రపరచి పూజా గృహంలో పెట్టుకున్నారు. అది ఈనాటికీ పుదుక్కోట రాజభవనంలో ఉన్నది. విజయ రఘునాథ తొండమాన్‌కు స్వామి దీక్ష ఇచ్చిన స్థలం శివజ్ఞానపురంగా ప్రసిద్ధం. స్వామి తాముపదేశించిన మంత్రం అనుష్ఠాన విధానం తమ సహాధ్యాయి మహాభాష్యం గోపాలకృష్ణశాస్త్రి వద్ద నేర్చుకోవలసిందని రాజును ఆదేశించినారు. రాజు ఆ వైయాకరణిని తన గురువుగా స్వీకరించి గౌరవించినాడు. రాజు గోపాలకృష్ణశాస్త్రికిచ్చిన 1738 తామ్రశాసనం చరిత్ర పుటలకు ఎక్కింది. ఆయేటి నుండి పుదుక్కోట సంస్థానం వారు నవరాత్ర్యుత్సవాలు వైభవోపేతంగా జరుపనారంభించినారు. సదాశివ బ్రహ్మేంద్రుల ఆశీస్సులతో పుదుక్కోట సంస్థానం దినదినాభివృద్ధి చెందినది. ఆ రాజులు స్వామిని తమ కులగురువులుగా సంభావించినారు. స్వామివారి విగ్రహం బృహదంబా గోకర్ణేశ్వర ఆలయ ప్రాంగణంలో దక్షిణామూర్తి

గుడి సమీపాన ప్రతిష్ఠించి అర్చించినారు. ఆయేడే తమిళయోగి తాయుమానస్వామి సదాశివ బ్రహ్మేంద్రులను కలుసుకున్నారు.

సదాశివబ్రహ్మేంద్రులు ఇష్టపడి నెరూరులో తమ చరమ జీవితం గడిపినారు. అఖండ కావేరీ తీరాన సమాధి చెందవలెనని వారి కోరిక. తాము శరీరం చాలించే సమయం ఆసన్నమైనదని విజయరాఘవ తొండమాన్‌రాజుకు తెలియజేసినారు. తమ దివ్యశక్తి చేత మైసూరు తంజావూరు పాలకులకు కూడా తెలియజేసినారు. స్వామి తొండమాన్ రాజుకు సమాధి స్థలం నిర్దేశించినారు. రాజు గుర్వాజ్ఞను పాటించి సమాధికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసినారు. స్వామి తాము విదేహులైన తొమ్మిది దినాల తరువాత తమ సమాధిపైన బిల్వవృక్షం పొటమరిస్తుందనీ 12వ నాడు కాశీ నుండి ఒక బ్రాహ్మణుడు శివలింగం తెస్తాడనీ దానిని తమ సమాధికి తూర్పున 12 అడుగుల దూరాన ప్రతిష్ఠించి గుడి కట్టించవలెననీ చెప్పినారు. తంజవూరు మైసూరు భక్తులు వచ్చినారు. అందరూ చూస్తుండగా వైశాఖ శుద్ధ దశమి నాడు స్వామివారు నెరూరు గ్రామం బయట (ఇది తంజావూరు రాజ్యంలోనిది), పుదుక్కోటరాజు సిద్ధం చేయించిన భూగృహంలోనికి దిగి స్వామి జీవసమాధి ఐనారు. స్వామి ఏకకాలంలో నెరూరులోనూ, మనమదురైలోను, కాశీలోను సమాధి చెందుతుండగా వేలకొలది భక్తులు దర్శించినారంటారు. ఇట్టి విచిత్రలీలలు కడప - కర్నూలు నారాయణరెడ్డి అవధూత గురించి కూడా వింటాము. స్వామి స్థూల శరీరం నెరూరులోను, సూక్ష్మశరీరం కాశీలోను, కారణం శరీరం మన మదురైలోను భక్తులు దర్శించి ఉంటారని పండితుల వివరణ. సదాశివబ్రహ్మేంద్రులు చెప్పినట్లే 9వ నాడు వారి సమాధినుండి బిల్వవృక్షం పొటమరించింది. ఈనాడది మహావృక్షం. 12వ నాడు కాశీనుండి శివలింగం వచ్చింది. విజయ రఘునాథ తొండమాన్ గురువు ఆజ్ఞ ప్రకారం శివలింగ ప్రతిష్ఠ చేయించి గుడి కట్టించినాడు. ఈనాడా సమాధి విశాల ప్రాంగణంలో వసతి సౌకర్యాలతో తీర్థరాజంగా మారింది. భక్తులా సమాధి వద్ద ప్రార్థించి కోరికలు నెరవేర్చుకుంటారు, మనశ్శాంతిని పొందుతారు, తమ శంకలకు సమాధానాలు పొందుతారు. శృంగేరి జగద్గురువులు నరసింహ భారతీ స్వామివారు (1817-1879) ఆ సమాధి చెంత మూడు దినాలుండి తమ శంకలు తీర్చుకొని 45 శ్లోకాల్లో స్వామిని భావనిర్భరంగా స్తుతించినారు. పరంపరగా విన వచ్చే స్వామివారి కొన్ని మహిమలు ఆ పద్యాలలో ఉన్నవి. 1912 నుండి స్వామి అరాధనోత్సవాలు అవ్యాహతంగా జరుగుతున్నవి.

11-2-1996 నాడు నేను ఆ సమాధిని దర్శించినాను. ఆరాధనోత్సవాలు వైశాఖ శుద్ధ పంచమి శంకర జయంతి నాడు ప్రారంభమై దశమినాడు ముగుస్తాయని అర్చకస్వామి నాతో అన్నారు. అప్పుడు తిరువైయారులో వలె సంగీతోత్సవాలు కూడా జరుగుతాయట. బిల్వవృక్షం మొదట పార్థివలింగానికి వేదోక్తంగాను, శివాలయంలో ఆగమోక్తంగాను, అర్చనలు జరుగుతున్నవి. ప్రస్తుతం ఇది ప్రభుత్వం వారి దేవదాయ ధర్మాదాయశాఖవారి అధీనంలో ఉన్నది. 1965, 1977, 1995 సంవత్సరాల్లో కుంభాభిషేకాలు జరిగినవి. పల్లెటూరి ప్రశాంత వాతావరణంలో స్వామివారి సమాధి నిరాడంబరంగా ఉన్నా ఆధ్యాత్మిక సాధకులకు భక్తులకు భూతల స్వర్గం, ఒక పవిత్ర తీర్థరాజం. ఆంధ్రయోగుల్లో సదాశివ బ్రహ్మేంద్రులు నామ సంకీర్తనామృత పాన మత్తచిత్త పరమహంస, తమ రచనల ద్వారా లోకానికి బ్రహ్మజ్ఞానం పంచిన ఆదర్శయోగి, స్వయం బ్రహ్మజ్ఞాని, జీవన్ముక్తులు, నిత్య సత్యజ్ఞానానందమయులు.

*ఆధారాలు:*

1. విజ్ఞాన సర్వస్వము III vol 1951 ప్రొఫెసర్ వి. రాఘవన్
2. The Saints of the Cauvery Delta - 1978 ఆర్. కృష్ణమూర్తి
3. తెలుగుయోగులు - 1987 మేడపాటి వెంకటరెడ్డి
4. His Philosophy and Music live on - The Hindu 20 - 1 - 1995. V. గణపతి.

*"శబ్దాదిభిః పంచభిరేవపంచ*
*పంచత్వ మాపుః స్వగుణేనబద్ధాః*
*కురంగమాతంగ పతంగ మీన*
*భృంగాః నరః పంచభివంచితః కిమ్"*

*లేడి - శబ్దము, ఏనుగు - స్పర్శము, మిడుత - చూపు, చేప - జిహ్వ, తుమ్మెద - ఘ్రాణము - వీటి వ్యామోహం చేత నశిస్తాయి. ఇక మానవుడు ఈ ఐదు ఇంద్రియాల ప్రభావానికి లోనవుతాడు. వ్యామోహంలో చిక్కుకుంటాడు. కాబట్టి అతడినాశనం వీటితో ముడిపడి వుంది.*

# సర్వార్థ సంక్షేమ సమితి,

**501, ప్రదీప్ అపార్ట్‌మెంట్, గాంధీనగర్, హైదరాబాద్ –380.**

## *సభ్యులుగా చేరండి – ధార్మిక సేవలో పాల్గొనండి*

| | సర్వార్థ సంక్షేమ సమితి సభ్యత్వ వివరములు | విశ్వప్రకాశం సభ్యత్వ వివరములు |
|---|---|---|
| 1 మహారాజపోషకులు | రూ. 1,00,000-00 | రూ. 15,000-00 |
| 2. రాజపోషకులు | రూ. 50,000-00 | రూ. 10,000-00 |
| 3. పోషకులు | రూ. 25,000-00 | రూ. 5,000-00 |
| 4. కార్యనిర్వాహక సభ్యత్వము | రూ. 10,000-00 | - |
| 5. శాశ్వత సభ్యత్వము | రూ. 1,000-00 | రూ. 1,000-00 |
| 6. వార్షిక సభ్యత్వము | రూ. 100-00 | రూ. 60-00 |
| 7. ద్వివార్షిక సభ్యత్వము | | రూ. 120-00 |
| 8. విడి ప్రతి | - | రూ. 5-00 |

పై సభ్యత్వములకు చెక్కు లేదా డి.డి. ద్వారా లేదా నగదు రూపకంగాను స్వీకరించబడును. మరియు 80 G ఇన్‌కంటాక్సు లబ్ది పొందవీలగును.

*విశ్వప్రకాశం ధార్మిక మాసపత్రికకు*
*ప్రకటనలు పంపండి, ప్రోత్సహించండి*

## పత్రికా ప్రకటన వివరములు

| | | |
|---|---|---|
| 1. | వెనుక కవరు పేజీ | రూ.2,500-00 |
| 2. | రెండవ కవరు పేజీ | రూ.1,500-00 |
| 3. | మూడవ కవరు పేజీ | రూ.1,500-00 |
| 4. | లోపలి పూర్తి పేజీ | రూ. 500-00 |
| 5. | 12 మాసాలకు 12 సంచికలకు చిన్న సైజులో | రూ.2,500-00 |

[illegible]
[illegible]




ఆలయములు వేరైనా ఆరాధకుడొక్కడే.     మతాలు వేరైనా ఆశయం ఒక్కటే

మానవతే మానవుని ప్రథమ కర్తవ్యం.

**BOOK POST** Printed Matter

To

___

___

___

*If underlivered please return to,*
SARVARTHA SANKSHEMA SAMITHI
501, Pradeep Apartments, Gandhinagar, Hyd-38.

**Edited, Printed & Published by Sri P.V. Manohara Rao, Sarvaardha Sankshema Samithi,** ...abad-20.
**Designed at *Advanced Graphic Systems*, Hyd-20,** Printed at Padmasri Graphics, 1-1-770/5,
Gandhi Nagar, Hyd. -500 380, Tel : 7612283